ఓమ్.

# సదుపదేశకథలు

## మొదటి భాగము

కవికుమార,

మహావాది వేంకటరత్న విరచితము.

ప్రకాశకులు:

శ్రీ లక్ష్మీస్టోర్సు: తెనాలి.

1930.



(Price Rs. 0-3-0.

# తొలిపలుకు

ఉపాధ్యాయులారా!

ఈసదుపదేశకథలు, బాలురకుఁ జక్కఁగాఁ దెలియునట్టి సులభశైలిని నాలుగు భాగములుగా రచియింపఁ బడినవి. ఈసదుపదేశము లన్నియుఁ గథామూలకములు. ఉపదేశములు గథామూలములగుచో బాలురకుఁ బఠనీయములు, బోధనీయములు. ఇది యుపాధ్యాయ సంఘమునకు విదితము. ఇందు వివిధములగు కథలుగలవు. కొన్ని పౌరాణికములు. కొన్ని కల్పితములు. కొన్ని చరిత్రాత్మకములు. కొన్నియెడల నొక భాగమునఁ దెలుపంబడిన కథలే వేఱొక భాగమునఁ దెలుపఁబడినవి. ఇందుకుఁ గథా విపులీకరణమే మూలకారణమనియెఱుంగునది. మఱియునిట్టికథామూలకంబులగు నుపవాచకంబు లెన్నియేనియు బాలురకొఱకిదివఱకే పుట్టియున్నవి. ఇట్లు పుట్టుటకు వ్యక్తుల యభిరుచులే ప్రధానకారణములు. అయిన నొకదాని యుత్కృష్టత యింకొకదానికిరాదు. ఉత్కృష్టతనుబట్టియే ప్రాశస్త్యము గలుగుచుండును. కావున నీసదుపదేశకథల గుఱించిప్రత్యేకముగాఁ జెప్పు టనవసరము. బోధకులే వీని ప్రాశస్త్యమును నిర్ణయింతురుగాక!

# విషయసూచిక





# సదుపదేశకథలు

(మొదటి భాగము)

## 1 కృష్ణుఁడు.

విద్య నేర్చినవాఁడు అన్నిచోట్లఁ బూజింపఁబడును.

"ఆ॥ విద్యలేనివాఁడు విద్యాధికులచెంత
నుండినంతఁ బండితుండుగాడు
కొలని హంసలకడఁ గొక్కెరయున్నట్లు
విశ్వదాభిరామ వినరవేమ."

పూర్వము వసుదేవుఁడను యాదవ ముఖ్యునకు బలరామ కృష్ణులను నిద్దఱు కొడుకులుండిరి. వీరిరువురును బాల్యముననుండియు శౌర్యము గలవారై యుండిరి.

తమ చిన్న తనమునందే వీరు దుర్భాగ్యులయిన రాక్షసుల బెక్కుమందిని వధించిరి. వీరికొక మేనమామ యుండెను. అతనిపేరు కంసుఁడు. వాడు మిక్కిలి క్రూరాత్ముఁడు. ఎప్పుడును దుష్కార్యములనే సేయుచుండును. సజ్జనుల బాధించుచుండును. కృష్ణుఁడు జన్మించిన నాటనుండియు నాతని మూలమునఁ దనకు హాని సంభవించునని యాతఁడా కృష్ణుని జంపుటకనేక యత్నములు సేయుచుండెను. అప్పుడు బలరామకృష్ణులు వ్రేపల్లెనుండి మధురాపురమునకుఁ బోయి మేనమామ యనియైనఁ దలంపకుండ నా కంసునిఁజంపి యాతనిచే బంధింపఁ బడియున్న తమతల్లిదండ్రుల చెఱఁబాపిరి.

కేవలము బాలురైన బలరామ కృష్ణులు కంసునిఁ జంపిన యంతనే వారికీర్తి నాల్గు దిక్కులఁ వ్యాప్తమయ్యెను. అనేకమంది పెద్దలును, మునీశ్వరులును, వారి యొద్దకు వచ్చుచుఁ బోవుచుండిరి. అప్పటికి బలరామకృష్ణులేమియుఁ జదువుకొని యుండలేదు. ఎవ్వరైనఁ బెద్దలు వారి చదువుం గూర్చి యడిగినప్పు డేమియు బదులు చెప్పఁజాలక యూరకొనుచుండిరి. అప్పుడు బలరామకృష్ణులు ఎంత శౌర్యము గలవారయినను విద్యలేకున్నఁ బూజింపఁ బడరనియు విద్యయున్నవాఁడు సభలలో బూజింపఁ బడుననియు నందుచే విద్య నేర్చుకొనుట మంచిదనియుఁ దలంచి కాశీ

నగరమునకుఁ బోయిరి. అచ్చట సాందీప్నుఁ డను నొక బ్రాహ్మణుండెను. ఆతఁడు సమస్తశాస్త్రములు సంపూర్తిగఁ జదినవాడు. బలరామ కృష్ణులాతనికి శిష్యులై విద్య లన్నియుఁ బూర్తిగా నేర్చుకొని గృహము నకు వచ్చిరి. నాటినుండియు వారు కేవ లము గొప్ప వీరులని పేరుపొందుటయె గాక సమస్తవిద్యల నెఱింగిన మహాత్ములని కూడ పేరుపొంది యందఱిచేతను సన్ను తింపఁ బడుచుండిరి.

## 2 శిబిచక్రవర్తి.

శరణన్న వానిని గాపాడవలయును.

ఆశ్రితులను గాపాడుట మానవునకు ఉండవలసిన ధర్మగుణములలో ముఖ్యమైనది. పూర్వము శిబి యను నొక రాజుండెను. ఆతఁడు సత్యసంధుఁడు ధర్మమూర్తి తన్ను ఆశ్రయించిన వారి నెప్పుడును విడచువాఁడు గాడు. ఆశ్రితులను రక్షించుటయే యాతనికి భూషణమైయుండెను. దానము సేయు వారిలో అంతటివాఁడు లేడని ఆ కాలమున నాతఁడు గొప్పకీర్తిఁ బొందియుండెను. ఇట్లుండ నొక సమయమున నింద్రుఁడును, అగ్నిదేవుఁడును, ఆతని గుణము బరీ

క్షింపదలంచి, ఒకఁడు డేగయై, యిం
కొకఁడు పావురమై బయలుదేరిరి. డేగ
వలన భయమునందిన చందమున పావు
రము కడురయమునఁ బరుగిడుచు శిబిం
జేరి శరణుఁ బొందెను. పావురమును
దరుముకొనుచు వచ్చిన యా డేగ శిబి.
చక్రవర్తిని జూచి "రాజేంద్రా! నీవు
సమస్త ధర్మముల నెఱింగిన వాఁడవు.
నేను ఆకలిబాధచే ఈ పావురమువెంటఁ
దగిలితిని. దీనికి నీవు భంగము సేయుట
తగదు. డేగలకు పావురము లాహారము
గాఁదగినవి. నా కుటుంబము దీని నాహార
ముగాఁ గొనకున్నచో జీవింపదు. నీ వీ
పావురమును రక్షింపఁ గోరితివి. నీవు
దీనిని రక్షించుటయే ముఖ్యమని తలంచి

తివి గాని, దీని వలన నెన్ని ప్రాణులను హింసబెట్టిన వాఁడ వగుదువో యాలో చింపవైతివి" అని పలికెను. శిబి యా డేగం జూచి ఓ డేగా! నీ వాక్యములు నిజమే. కాని యీ కపోతము ప్రాణభయమున నన్నాశ్రయించినది. శరణన్న వారిని రక్షించు బిరుదము గల నేను దీనిని విడచుట ధర్మము కాదు. నీవు పక్షివయినను ధర్మమునే పలుకుచుంటివి. ఇంతకు నీ యాకలి బాధకుఁ గదా దీనిం జంపఁ దలంచితివి? అరణ్యమున నున్న యనేక జంతువుల మాంసము నీకు లభించును. దానిం గొని నీ యాకలిఁ దీర్చుకొనుము. దీని తెలుపునకుఁ బోవల"దని నుడివెను.

అందులకా వదాన్యుని గాంచి డేగ యిట్లనెను. "రాజా! నేను ముఖ్యముగా భుజింపవలసినది యీపావురముమాంసమే. నీకు దీనింగాపాడు బుద్ధియున్నచో దీని యెత్తుమాంసము నీశరీరమునుండి కోసి యిమ్ము". డేగ మాటలకు శిబి సమ్మతించి తన శరీరమున వివిధాంగముల మాంసమును గోసి త్రాసునందొక ప్రక్కనుంచెను. రెండవప్రక్కఁగపోతముండెను. కపోతమే యెక్కువ బరువుగ నుండెను. మరలఁ దన శరీరము నుండి కొంత మాంసముగోసి త్రాసునందుంచెను ఎంత మాంసము వేసినను గపోతముతో సరి తూగుటలేదు. ఇందులకు శిబి యద్భుతమునంది నెత్తురు గారుచున్న శరీర

ముతో తానే త్రాసునందుఁ గూర్చుండెను. అంతట డేగయుఁ బావురమును ఆరూపములు విడిచి నిజరూపములతో శిబి యెదుట నిలిచి "రాజా! మేమింద్రాగ్నులము. నీ చిత్తమును బరీక్షించుటకై యిట్టి వేషముల బూనినారము. నీసాహసమునకును వదాన్యతకును మిగుల మెచ్చితిమి. నీకీర్తి యాచంద్రతారకముగ నుండుఁగాక" యని పలికి యనేక వరములిచ్చి చనిరి. శిబియు బూర్వపు దేహమునుబొంది సుఖముగా నుండెను.



## 3 లిఖితుఁడు.

దొంగతనము సేయరాదు.

తే॥ కల్లుద్రావుట గురుపత్ని గవయుటయును
విప్రుఁజంపుట బ్రహ్మస్వ విషయమైన
ముచ్చిలుటయును నివిగల క్రూరజనులఁ
బ్రీతిఁ బొందుటయును మహా పాతకములు.”

బాహుదా నదీతీరమున ఆశ్రమము గల్పించుకొని శంఖుఁడు లిఖితుఁడు అను నన్నదమ్ములు నివాసము సేయుచుండిరి. సమస్త శాస్త్రములను జదివినవారు భగవంతుని సేవించుచు సుఖముగాఁ గాలము గడపుచుండిరి. ఇట్లుండ శంఖుఁడు ఆశ్రమమున లేని సమయమున లిఖితుఁడు సమీపమున నున్న యొక వనమునకుఁబోయి యందలి పండ్లను గోసికొని తినెను. శంఖుఁడు ఆశ్రమమునకువచ్చి “నీవుతిన్న

ఫలములెక్కడి" వని యడిగెను. లిఖితుఁడు సత్యమును చెప్పెను. అప్పుడు శంఖుఁడు తమ్మునిజూచి యిట్లుపలికెను. "ఆవనమున కధికారి రాజైయుండెను. నీవాతనియాజ్ఞగైకొనకుండ, వనమునందుఁ బండ్లుగోసి తింటివి. ఇయ్యది దొంగతనమనఁబడును. దీనివలనఁ బాపము గూడ సంభవించును. కావున నీవు కడు శీఘ్రముగా రాజుకడకుఁబోయి, నీనేరమును జెప్పుకొని దండించుమని వేడుము."

అగ్రజుని మాటలకు సమ్మతించి లిఖితుఁడు కడు రయమున రాజుకడకుఁ బోయెను. రాజు లిఖితునిఁజూచి పీఠముపైనుండిలేచి నమస్కరించి వినయముతో

నిట్లనెను "బ్రాహ్మణోత్తమా! మీరువచ్చుట చేత నేను కృతార్థుఁడ నయితిని. నామందిరము పావనంబయ్యెను. మీతపముబాగుఁగ సాగుచున్నదా? మృగబాధ యేమియు లేదుగదా? నావలన మీకేమి కావలయు? సెలవిండు చేసెద." ఆమాటలకు లిఖితుఁడిట్లు చెప్పెను. "రాజా! నేను నీయనుమతిఁ బొందకుండ వనంబుఁన బండ్లను గోసికొని తింటిని. కావునఁ దస్కరులను శిక్షించు విధమున నన్ను శిక్షించి, పాపము లేకుండఁ జేయుము. రాజుచే దండింపఁబడిన వారిని యముఁడు దండింపఁడని పెద్దలు చెప్పుదురు. నన్ను దండించినందువలన నీకుఁ బాపముంటదు"

లిఖితుని పలుకులకు రాజు విస్మయ మును విచారమును బొంది "మహాను భావా! నేనట్టి కార్యమును చేయఁజాల" నని యనేక విధముల బ్రతిమాలి చెప్పెను. కాని లిఖితుఁడు వినలేదు. అంతట రాజేం ద్రుఁడు లిఖితుని కరములు ఖండించెను. పిమ్మట లిఖితుఁడు రాజు నాశీర్వదించి నిజా శ్రమమునకు వచ్చి ఖండింపఁబడిన చేతుల నగ్రజునకుఁ జూపెను. లిఖితుఁడు తమ్ముని విలోకించి "ఇక నీవు బాహుదానదియందు స్నానము సేయుము. కల్లుద్రావుటయును గురుపత్నిని గూడుటయును, దొంగిలించు టయు, బ్రాహ్మణునిఁ జంపుటయు, పాత కములని చెప్పుదురు. ఈపాతకములలో నెవ్వఁ డేది యొనర్చినను దండనమున

కర్షుఁడే. రాజుచేదండింపఁబడినవారు పాత
కముల‌ఁ బాయుదురు." అని పలికెను.
అన్న యానతి ననుసరించి లిఖితుఁడు నది
యందు స్నానము చేసిన యంతనే,
ఖండింపఁ బడినహస్తము లెప్పటివలె
వచ్చెను. లిఖితుఁ డందుల కద్భుతమందు
చుండ శంఖుఁడు "తమ్ముఁడా! దీనికి నీ
వచ్చెరువునొందఁబనిలేదు. ఇందులకుఁబర
మేశ్వరుని దయవలనఁ గలిగిన నాతపో
మహిమయే యని యెఱుంగుము. నీవింక
శుచివైతివి. నిన్ను శిక్షించిన నృపాలుఁ
డును ధన్యుఁడయ్యె నని పలికెను.



## 4 యాదవులు.

### మద్యపానము పనికిరాదు.

మధుపానము మానవుని మతిపోఁగొట్టి యెట్టి కార్యమునయినఁ జేయించును. అయ్యది మానవుని గౌరవ మంతయు నశింపఁజేయును. పూర్వము ద్వారకా పురములో నొకచోట సాంబుఁడు మొదలగు యాదవ కుమారులు బంతియాడు కొనుచుండిరి. ఆసమయమునఁ గృష్ణునిఁ జూచుటకుఁ గొందఱు మునీంద్రు లామార్గమునఁ బోవుచుండిరి. అప్పుడు యాదవ కుమారులు సాంబునకు స్త్రీవేషము వేసి యా మునులయొద్దకుఁ దీసికొని పోయి నవ్వుచు "ఈమె కేశిశువు జనించు" నని

యడిగిరి తమ్ముఁబరిహాసము సేయుటకు యాదవ కుమారు లిట్లు చేసినారని యమ్మునులు గ్రహించి యయ్యాదవుల నవలోకించి "ఈమె గర్భమున నొక ముసలము పుట్టు" ననిచెప్పి యరిగిరి. మునులరిగిన పిదప యాదవులు సాంబునకుఁ గట్టఁబెట్టిన వస్త్రము విప్పగనే యందుండి యొక రోకలిపడెను. యాదవ బాలురు దానిం జూచి మునులవాక్యములు సత్యమయ్యెనని తలఁచి భయంబందుచుఁ గృష్ణుని సన్నిధికి బోయి జరిగిన సంగతి నంతయు నెఱింగించిరి. కృష్ణుఁడా రోకలిని అరుగదీసి సముద్రమున గలిపిరండని వారికిఁ దెలిపెను. యాదవులట్లు చేసిరి. కాని యది సముద్ర

జలమున గలిసిపోవక సముద్ర తీరమున తుంగగా మొలచెను.

శ్రీకృష్ణుఁడు జన్మించిన యీయాదవ కులము శౌర్యమునకు నిలయమై యుండెను. సాధారణముగా యాదవుల నెవ్వరు ను జయింపఁ జాలరు. తమ్మెరును జయింప లేరను గర్వము వారికి బాగుగ నున్నది. ఇట్లుండ నొకనాఁడు యాదవ వీరుల కందఱకును సురాపానము సేయ వలయునని కోరిక జనించెను. వారందఱు నట్లు చేసి సముద్రతీరమునకుఁ బోయిరి. అక్కడ వీరు గ్రామదేవత పూజలు మొద లగునవి చేయుచుఁ గొన్ని దినము లుండిరి. ఈయున్న దినములలో వారొ

డలు తెలియకుండఁ ద్రావి, యనేక విధ ములయిన ప్రసంగములు సేయుచుండిరి. ఒకనాడు వారు పూర్తిగాఁ ద్రావి భారత యుద్ధ సంబంధ మయిన మాటలాడు కొనుచు, కలహము పెంచుకొని, వారిలో వారక్కడ నున్న తుంగచేఁ గొట్టుకొని యందఱును జచ్చిరి.



## 5 శంబరాసురుఁడు

(ద్వైకసంకల్పముతప్పదు)

పూర్వము మన్మథుఁడీశ్వరుని కోపముచే దగ్ధుఁడయ్యెను. ఆతఁడు మరలఁ దన శరీరమును బడయుటకు ఈశ్వరుని గూర్చి తపస్సుఁ జేసెను. దానంజేసి యతడు కృష్ణునకు రుక్మిణీదేవి యందు ప్రద్యుమ్నుఁడై పుట్టెను. ఒక దినమున నారదముని శంబరుఁడను రాక్షసుని యొద్దకుఁ బోయి "రాక్షసరాజా! కృష్ణునకు ప్రద్యుమ్నుఁడను కొడుకు పుట్టినాడు. వానివలన నీకు మరణమున్న" దని చెప్పి పోయెను. ఆమాటలకు శంబరుఁడు భయమంది, ప్రద్యుమ్నుని వలనఁ జావుతే

కుండు మార్గము చూడసాగెను. తుదకు అతడు కామరూపుడై రుక్మిణీదేవి మందిరముఁ జొచ్చి, పురుటింటనున్న ప్రద్యుమ్ను నెత్తుకొనిపోయి సముద్రమునఁ బడవేసి, ఇఁక వానివలన తనకు ప్రాణభయంబుండదని తలంచెను. అంతటితో నాతఁడాసంగతి మఱచిపోయెను. శంబరుని చేఁ బాఱవేయఁ బడిన శిశువును నొక పెద్దచేప మ్రింగెను. పల్లెవాండ్రు వలలు వేసి చేపలను బట్టుచుండఁగా, నాశిశువును మ్రింగిన చేప వారివలలోఁ బడెను. అది సామాన్య మైన మత్స్యముగాక పోవుటచేఁ జాలరులు దానిని శంబరునకు గానుకగా నర్పించిరి. శంబరుఁడాచేపను వంట వారి

యొద్దకుఁబంపెను. వంటవారాచేపకడుపు కోయగా నందున్న శిశువు గనఁ బడెను. వెంటనే వారావృత్తాంతమును శంబరాసురున కెఱింగించిరి. ఆనాడు తాను సాగరమునఁ బడవేసిన ప్రద్యుమ్నుఁడే యీతఁడని యతఁడూహింప లేదు. ఆసంగతి యాతనికి జ్ఞాపకమే లేదు. అప్పుడచ్చటికి శంబరుని భార్య చెలికత్తెయగు మాయావతి యనునది వచ్చి శంబరునిఁ గాంచి "మహారాజా! నేను సంతానము లేనిదానను. దయచేసి నాకీపిల్లవాని నొసంగినఁ బెంచుకొందు" నని వేడెను. శంబరుఁడా పిల్లవానిని మాయావతి కిచ్చెను.

యాతనికి మహామాయావిద్య నుపదేశిం చెను. అంతటఁ బ్రద్యుమ్నుఁడు ధనుర్బాణములను ఖడ్గమును ధరించి శంబరుని యుద్ధమునకుఁ బిలిచెను. ఇరువురకును గొప్పయుద్ధమయ్యెను. తుదకుఁ బ్రద్యుమ్నుడు శంబరుని జంపి రతీదేవితో ద్వారకానగరమునకుఁ బోయి తల్లిదండ్రులకానందము గలుగఁజేసెను.



## 6 శిశుపాలుఁడు

బలవంతునితో విరోధముకూడదు.

శిశుపాలుఁ డనువాఁడు చేది దేశమునకు రాజు. ఈతఁడు ద్వారకాపురాధీశ్వరుఁడైన కృష్ణునకు మేనత్తకొడుకు. ఈతఁడు చిన్నతనము నుండియుఁ గృష్ణుని ద్వేషించుచుండెను. ఇతఁ డనేకమైన యెగ్గులుచేసెను. కృష్ణుని తండ్రియైన వసుదేవుఁడు యాగము సేయుచుండఁగా నీశిశుపాలుడు హయమును దొంగిలించి భంగము గలిగించెను. కృష్ణుని బంధువులగు భోజరాజులు స్త్రీలతో రైవతక పర్వతమున నిద్రించుచుండఁగా దాని కగ్నిఁబెట్టెను. శిశుపాలుఁడిట్టి క్రూరకృత్యములు సేయుచున్నను

గృష్ణుఁడు శాంతము వహించి యుండెను. ఇందులకుఁ గారణమేమనిన శిశుపాలుని చిన్నతనమునందు నూరుతప్పుల వఱకు నతనిని మన్నించెదనని యాతని తల్లికి కృష్ణుడు వరమిచ్చి యుండెను. కృష్ణుఁడు గొప్ప మహిమగలవాడని శిశుపాలునకు దెలియును. తెలిసియుండియు నామహాత్ముని సాధించుటకే యోచించుచుండెను. ఎప్పటికైన నాతఁడు తన బుద్ధిని మరల్చు కొను నేమో యని కృష్ణుఁడు చూచుచుండెను. కాని యట్టిది సంభవింపలేదు.

ఇట్లుండ ధర్మరాజు రాజసూయ యాగము సేయఁదలఁచి యమ్మహాత్ము

వమ్ముఁ జూచుటకు రాజుల నందఱను బిలి
చెను. అందఱును వచ్చిరి. యాగము
పూర్తియగు దినమున ధర్మరాజు సభ్యులను
జూచి "ఇందు అగ్రపూజ కెవ్వరర్హులని"
ప్రశ్నించెను. శ్రీకృష్ణునిఁ బూజింపవల
సినదని భీష్ముఁడు ధర్మజునకుఁ దెలిపెను.
భీష్ముని మాటలకు సభయందున్న పెద్ద
లును, మునులును సమ్మతించిరి. అంతట
ధర్మరాజు కృష్ణుని పాదములను గంగాజల
ముతోఁగడిగి యా యుదకమును దన
నెత్తిపైఁ జల్లుకొని మంచి విలువగల వస్త్ర
ములను ప్రశస్తములయిన రత్నభూష
ణములను ఇచ్చి పూజించెను. దీనికి సభలో
నున్న శిశుపాలుఁ డోర్వఁజాలక సభికుల

గాంచి యిట్లనెను· "వృద్ధుఁడయిన భీష్ముని మాటలువిని ధర్మరాజు అవివేకియై కృష్ణుని బూజించినాఁడు· సకల ధర్మములు ·తెలిసిన జ్ఞానవంతులు ఎక్కువ సంపదగలరాజులు మునులుండ ఈవాసుదేవుఁడే పూజార్హుడనితోచెను? కృష్ణుడెందులో గొప్పవాడని పూజించెను? ఈకృష్ణునకుఁ గుల గోత్రములులేవు· తలిదండ్రు లెవ్వరో తెలియదు· పెక్కు రూపములతో నుండును· వావి వరుసలులేవు· పూర్వము యయాతి శాపము ననుసరించి యదుకులమువారికి రాజ్యమున కర్హతలేదు· ఈతఁడు జారుఁడు చోరుఁడు" అని పర పరి విధముల గృష్ణుని దూషించెను

శిశుపాలుని మాటలకుఁ బాండవులు కోపమునంది కృష్ణుని వంకఁ జూచు చుండిరి. శిశుపాలుఁడు కృష్ణుని దూషించుటయేగాక, యొరనుండి కత్తి దూసి యాతని పైకిఁ బోయెను. అప్పుడు కృష్ణుఁడు సభ్యులను జూచి ఈశిశుపా లుఁడు నన్ను దూషించుచున్న విధ మంతయు మీరు చూచుచుంటిరి కదా! ఈనీచాత్ముఁడు చిన్నతనము నుండియు నాకెగ్గుసేయుచునే యున్నాఁడు. వీని తల్లికి నేనిచ్చిన వరము ననుసరించి యింత వఱకోర్చి యుంటిని. వీనికి వినాశకాలము సమీపించుట చేతనే నేడీ సభలో నన్ను

దూషించినాఁడు. ఇఁక వీనిని సైరింప రాదు" అని పలికి తన చక్రముచే శిశుపాలుని శిరము ఖండించెను.

కావున ఎప్పుడును బలిమిగలవారితోఁ బగఁ గొనరాదు.



# 7 ఉత్తరుఁడు

డంబము పనికిరాదు–

మత్స్యదేశమును బరిపాలించు విర టుఁడను రాజునకు ఉత్తరుఁడు అను నొక కొడుకుండెను. ఈతఁడు బాలుడైనను ప్రగల్భములు పలుకుటలో మిగుల గొప్ప వాడు. తనకు శక్యముగాని కార్యము లోకములో లేదని చెప్పుచుండును. ఎట్టి పరాక్రమ వంతునినైనను యుద్ధములో గెల్తునని పలుకుచుండును. ఇట్లుండ నొక సమయమునఁ గౌరవులువచ్చి విరటుని గోవులను బట్టుకొనిరి. దీనినే ఉత్తర గోగ్ర హణమందురు. అంతట గోపాలకులు వచ్చి యీసంగతిని ఉత్తరునకుఁ దెల్పిరి. విరటు

డదివఱకే కౌరవులతో యుద్ధ మొనర్ప దక్షిణపు దిక్కున కరిగెను. అప్పుడుత్త రుఁడు గోపాలకులను అచ్చట నున్న వారిని జూచి "కౌరవులకు మన పరాక్ర మము తెలియదు. అందుచేతనే వారు మన గోవులను బట్టుకొనిరి. ఇప్పుడు నేను పోయి వారితో యుద్ధముచేసి మన గోవు లను మరల్చుకొని వచ్చెదను. నాబల శౌర్యములు చూచి వారు నన్ను అర్జునుఁ డనుకొనునట్లు పోరాడెద" నని పలికి తన తండ్రి కొలువులో పేరువేషమున బృహ న్నలయను పేరుతో నున్న యర్జునుని సారథిగాఁ జేసికొని కౌరవుల మీదికిఁ బోయెను.

ఇంటియొద్దఁ బలికిన ప్రగల్భవాక్యములన్నియు మఱచిపోయి, యీ యుత్తరుఁడు కౌరవ సైన్యములను జూడఁగనే భయమంది, రథము దిగి పాఱిపోవసాగెను. బృహన్నల వానిని రథముపైఁ గూర్చుండు మని బలవంత పెట్టెను. "ప్రాణములున్న బలుసాకయినఁ దినవచ్చును. నాకు యుద్ధమక్కఱలేదు. నేను కౌరవుల జయింపఁజాలను. కరుణించి నన్నింటికిఁ దీసికొని పొమ్ము. రథము మరలింపుము" అని వడకుచు నుత్తరుఁడు బదులుచెప్పెను. అంతట బృహన్నల వాని మాటలకు నవ్వి, తానురథమెక్కి యాతనిని సారథిగాఁజేసికొని, కౌరవులతోఁ బోరి గెలిచి, గోవులను మరలించుకొని వచ్చెను.

## ౩ దుర్యోధనుఁడు

ఎవ్వరిని అవమానింపరాదు.

పాండురాజు సంతతిని పాండవులనియు, ధృతరాష్ట్రుని సంతతిని గౌరవులనియుఁ బిలుతురు. కౌరవులలోఁ బెద్దవాడు దుర్యోధనుఁడు. దుర్యోధనుఁడు పాండవులను మాయజూదమున నోడించి, సర్వసంపదలు హరించి యడవులకుఁ బంపెను. అడవులకుఁ బోయిన పాండవులు ద్వైతవనంబున నివసించుచుండిరి. అరణ్యములోనున్న యాపాండవులకు దుర్యోధనుఁడు తన వైభవము జూపి, యవమానము సేయవలయు నని తలఁచి, యొకనాడు తమ్ములతోడను, ఆలుబిడ్డల

తోడను, మిత్రులతోడను, బోయి ద్వైత
వనమునకు సమీపమున విడిసియుండెను.
అప్పు డచ్చటికి గంధర్వనాయకుఁడైన
చిత్రసేనుఁడువచ్చి యాతనింజూచి, యా
ప్రదేశము తాను విహరించు స్థలము గాన
నచ్చట నుండవలదని చెప్పెను. ఆతని
మాటలు దుర్యోధనుఁడు పెడచెవిం బెట్టు
టయేగాక ఆతనినే నిందించెను. గంధర్వ
రాజునకుఁ గోపము వచ్చెను. అంతట
దుర్యోధనుని వెంట వచ్చిన వీరులను బాఱ
దోలి, చిత్రసేనుఁడు దుర్యోదనుని బం
ధించికొని పోవుచుండెను

అప్పుడు దుర్యోధనుని సేవకులు
పరుగెత్తుకొనిపోయి ధర్మరాజును గాంచి

యావృత్తాంత మెఱింగించి, దుర్యోధనుని రక్షింపవలసినదని కోరిరి. ఆపలుకులు విని భీముఁడు ధర్మరాజునుజూచి "అన్నయ్యా! మనము చేయఁదలఁచిన పని గంధర్వులే చేసిరి. మనల నవమానింపఁదలంచి వచ్చినందుల కాతఁడు తగిన ఫలమనుభవించినాఁడు. వానికట్టి శిక్షజరుగవలసినదే" యని పలికెను నకుల సహదేవులుగూడ నట్లే పలికిరి. ధర్మజుఁడు వారి పలుకుల వారించి యర్జునునితో నిట్లు పలికెను. "తమ్ముఁడా! దుర్యోధనుఁడు నిజముగా దుర్మార్గుఁడే బాల్యమునుండి యాతఁడు మనకు పెక్కుకష్టములఁ గల్పించినాఁడు. అందు కాతనిని మనమేశిక్షింపవలయును.

కాని యాతని పైకి, నితరులెత్తి వచ్చి నప్పుడు రక్షించితిమేని మన ధర్మబుద్ధి వెల్లడియగును. కావున నీవు నామాట కెదురాడక, తక్షణమే యాతనిని గంధర్వుల బారినుండి రక్షింపుము."

ధర్మజుని యాజ్ఞననుసరించి యర్జునుఁడరిగి, దుర్యోధనుని బంధించికొని పోవుచున్న గంధర్వుని నిలువరించి, యతనితోఁ బోరి, దుర్యోధనుని విడిపించుకొని ధర్మరాజు కడకుఁ దోడ్కొనివచ్చెను. పాండవుల నవమానింపఁదలఁచి వచ్చి తుదకు దానే యొరులచే నవమానింపఁ బడినందులకు దుర్యోధనుఁడు సిగ్గుపడి తన వారితో నిజపురమునకుఁ బోయెను.



## 9 మాండవ్యుఁడు

జీవహింస సేయరాదు.

పూర్వము మాండవ్యుఁడను నొక మునీశ్వరుఁడుండెను. ఈతఁడు బాల్యమున తూనీగలను బట్టుకొని, వాని తోకలకు ముండ్లు గ్రుచ్చి యాడుకొనుచు నవి బాధకోర్వఁజాలక యటు నిటు గొట్టుకొనుచుండుటఁ జూచి నవ్వుచుండెడివాఁడు. పెద్దవాఁడయిన తరువాత తపోవృత్తిం బ్రవేశించి యొక యాశ్రమము గల్పించుకొని యందుండెను. ఆతని యాశ్రమమునకు దగ్గఱగా నొక పురముండెను. ఆనగరములో నొక వైశ్యుని గృహమునఁ గొందఱు చోరులు పడి,

యనేక సువర్ణ భూషణములను దొంగిలించి
కొనిపోవుచుండిరి. ఇంతలో నింటివారులేచి
కేకలువేయఁగా రాజభటులువచ్చి దొంగ
లను బట్టుకొనుటకు బరువెత్తిరి. ముందు
దొంగలు, వెనుక భటులు. ముందు పరు
గెత్తుకొని పోవుచున్న దొంగలు మాండ
వ్యుని యాశ్రమమును ప్రవేశించి యొక
మూల దాగియుండిరి. వారుతెచ్చిన నగలు
కొన్ని యాశ్రమమున జారిపడెను. దొంగ
లను దఱుముచు వచ్చిన భటులాశ్రమ
మునఁ బ్రవేశించి మాండవ్యునిజూచి "ఇటు
దొంగలు వచ్చిరా" యనియడిగిరి. ఆతఁడు
కన్నులు మూసికొని తపస్సుఁ జేసికొను
చుండుటచేత నేమియు బదులు చెప్ప

లేదు. అంతట భటులా క్రమమున నాలుగు మూలలు గలయఁజూడ దొంగలు చిక్కిరి. మాండవ్యుఁడుగూడ వారిలోనివాఁడే యని తలంచి బంధించికొని పోయిరి. రాజు వారి నందఱిని గొఱతవేయు నట్లాజ్ఞాపించెను. మాండవ్యుఁడు కొఱతయందుఁ జిక్కి బాధ పడుచుండెను.

ఇట్లు కొన్ని దినములు గడచిన పిమ్మట నామార్గమునఁ గొందఱు మునీంద్రులు పోవుచుండిరి. మాండవ్యుఁడు వారితో మాటలాడెను. అప్పుడు రాజ భటులది చూచి యాతఁడొక మునియని తలంచి కడు రయమునఁ బోయి రాజునకుఁ దెలిపిరి. వెంటనే రాజు మాండవ్యుని

గొఱతనుండి తీసివేయించి భటులు తెలియక నేరము చేసిరి కావున క్షమింప వలసినదని ప్రార్థించెను. తరువాత నొకప్పుడు మాండవ్యుఁడు యమలోకమునకుఁ బోయి యమునిఁ జూచి "తపోవృత్తినున్న నన్ను గొఱతశిక్ష ననుభవింపఁ జేసితివికదా" యని పలికెనుఁ "బాల్యమున నీవు తూనీగల బాధించి యాటలాడుకొనిన కారణమున నీకట్టి శిక్షకలిగె"నని యముఁడు బదులు చెప్పెను.



## 10 కర్ణుఁడు

రాజభక్తిని విడువరాదు.

కుంతీదేవికి సూర్యుని వరమునఁ గర్ణుఁడు పెండ్లి గాకపూర్వమే పుట్టెను. కుంతీదేవి యాతనింగని యెవ్వరైనఁ జూచిన నిందవచ్చునని యొక పెట్టెలోఁ బెట్టి నదిలో విడిచెను. ఆపెట్టె చిత్రరథుఁడను సూతునకు దొరికెను. ఆతఁడా పెట్టెఁ దెఱచి చూచి యందున్న బాలుని దీసికొని పోయి తన భార్యయగు రాధకిచ్చి పెంచుమనెను. రాధ పెంచుటచేత నాతనికి రాధేయుఁడను పేరుగూడ గలిగెను,

ఈకర్ణుఁడు పరశురాముని యొద్ద సమస్త శస్త్రాస్త్రవిద్యల నభ్యసించి గొప్ప

దిగాఁ గౌరవులను జేరెను. ఈతఁడు దుర్యోధనునకుఁ బ్రాణసఖుఁడై యుండెను. మిత్రునిపైఁ బ్రేమఁ జూపించుటకు దుర్యోధనుఁ డాతనిని అంగదేశమునకు రాజుగా జేసెను. తరువాత కొన్నాళ్లకు రాజ్యభాగమును గూర్చి కౌరవులకును బాండవులకును యుద్ధము గలిగెను. యుద్ధమునకు ముందుగా కౌరవ పాండవులకు సంధి యొనర్పఁ గృష్ణుడు పాండవదూతయై హస్తినాపురమునకు వచ్చెను. ఆతఁడు చెప్పవలసిన మాటలన్నియుఁ గౌరవులకుఁ జెప్పెను. సంధి పొసఁగలేదు. అప్పుడు కృష్ణుఁడు కర్ణుని రహస్యముగాఁ బిలిచి యాతని జన్మక్రమ మంతయుఁ దెల్పి పాండ

వులతోఁ గలియుమని చెప్పెను పాండవుల గలిసినచో ద్రౌపది కాఱవ భర్తఁగా జేయుదుననియుఁ జక్రవర్తిగాఁ జేయుదుననియుఁ జెప్పెను. ఎంతచెప్పినను గర్ణుఁడు వినలేదు. అతఁడు కృష్ణునిఁజూచి "నా ప్రాణము లున్నంత వఱకు దుర్యోధనుని కొఱకుఁ బాండవులతోఁ బోరుదును. నిలుకడలేని సంపదల కాసపడి నేను దుర్యోధనుని విడువను. అవసర మయ్యెనేని నే నాతనికొఱకు నాప్రాణముల నయిన నిచ్చెద" నని గట్టిగాఁ బలికెను. కర్ణుని రాజభక్తికిఁ గృష్ణుడేమియుఁ జెప్పలేక పోయెను.

****

## 11 చిత్రకేతుఁడు.

దేవుని నిందింపరాదు.

పూర్వము చిత్రకేతుఁడను రాజు శూర సేన దేశమును పాలించుచుండెను. అతఁడు మిక్కిలి ధర్మాత్ముఁడు. అసత్యము పలుకని వాఁడు సందలకుఁ గాని, భోగములకుఁ గాని, ఆతనికి ఏవిధమయిన కొఱత యులేదు. కాని సంతానము మాత్రము లేదు. అందుకై ఆతఁడెప్పుడును చింత పడుచుండును. ఇట్లుండ ఒకనాడు ఆతని యింటికి అంగిరసుడను ముని వచ్చెను ఈతనివిచారమును ఆమునీంద్రుడు గ్రహించి కరుణగలవాఁడై ఆరాజునకు ఒక ఫలము

నిచ్చి దానిని అతని పెద్దభార్యకు ఇయ్య వలసినదని చెప్పి పోయెను.

చిత్రకేతుడు ఆఫలమును తన పెద్ద భార్యకు ఇచ్చెను. ఆమె యాఫలమును దిని గర్భమును దరించి కొన్నాళ్లకు ఒక కుమారునిఁ గనెను. ఆమెకుఁ గొడుకు పుట్టి నప్పటినుండి చిత్రకేతుఁ డెప్పుడును ఆమె గృహమును విడువక ఆమె యందే యెక్కుడు ప్రేమ గలవాఁడై యుండెను. అందుచేతఁ దక్కిన భార్యలు పెద్ద భార్య యందు అసూయ వహించి సమయము చూచి, అమె కుమారునకు విషము పెట్టిరి. అందువలన ఆకుమారుడు చనిపోయెను. కుమారుని కొఱకు తల్లిదండ్రులు మిక్కిలి

దుఃఖించు చుండిరి. ఆసమయమున అక్క
డికి అంగీరసుడు వచ్చి చిత్రకేతునకు వైరా
గ్యమును బోధించి అతని దుఃఖమును
బాపెను. చిత్రకేతుఁడును విరాగియై సంసా
రమును విడిచి తపోవనంబున కరిగెను.
ఆతని తపంబునకు మెచ్చి, శ్రీహరి ఆతనీ
కొక దివ్యవిమానము నిచ్చెను.

చిత్రకేతుఁడా విమానము నెక్కి
యిష్టము వచ్చినట్లు మూడులోకముల
యందు సంచరించు చుండెను. ఒకనా
డతడు కైలాసమునకుఁ బోయెను. అప్పు
డక్కడ శంకరుఁడు పార్వతిని తన
తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని కొలువు
దీర్చియుండెను. ఆకొలువునందు మహా

మునులుగూడ నుండిరి. శంకరుఁ డట్లు భార్యఁగూడి యున్నందుకు చిత్రకేతుఁడు పక్కున నవ్వెను. మఱియు నది తగని పని యని శంకరుని దూషించెను. అందుకు శంకరుఁ డేమియు ననలేదు. కాని పార్వతికి మాత్రము పట్టరాని కోపము వచ్చెను. అప్పు డామె చిత్రకేతునిఁ జూచి "మూర్ఖుఁడా! పరమేశ్వరుని నిందించితివి కావున రాక్షసుండవై పుట్టు" మని శాపం బిచ్చెను. చిత్రకేతుం డంత తానుచేసిన దోషమును మన్నింప వలసినదని పార్వతిని వేడికొనెను. ఆదేవియు నాతనిమొడ జాలి గొని త్వరలో శాపవిముక్తి యగునట్లు అనుగ్రహించెను. ఈ చిత్రకేతుఁ డే

పార్వతీదేవి శాపమువలన వృత్రాసురుఁడై పుట్టి, ఇంద్రునిచేఁ గూలి శాప విముక్తి నొందెను. కావున నెంత వారికిని దైవనింద పనికిరాదు.



ఓమ్.

# సదుపదేశకథలు

## రెండవ భాగము

కవికుమారి
మహావాది వేంకటరత్న విరచితము.

ప్రకాశకులు:
శ్రీ లక్ష్మీస్టోర్సు: తెనాలి.

1930.

 (Price Rs. 0-4-0.

# తొలిపలుకు

ఉపాధ్యాయులారా!

ఈసదుపదేశకథలు, బాలురకుఁ జక్కఁగాఁ దెలియునట్టి సులభశైలిని నాలుగు భాగములుగా రచియింపఁబడినవి. ఈసదుపదేశము లన్నియుఁ గథామూలకములు. ఉపదేశములు గథామూలములగుచో బాలురకుఁ బఠనీయములు. బోధనీయములు. ఇది యుపాధ్యాయ సంఘమునకు విదితము. ఇందు వివిధములగు కథలుగలవు. కొన్ని పౌరాణికములు. కొన్ని కల్పితములు. కొన్ని చరిత్రాత్మకములు. కొన్నియెడల నొక భాగమునఁ దెలుపఁబడిన కథలే వేఱొక భాగమునఁ దెలుపఁబడినవి. ఇందుకుఁ గథా విపులీకరణమే మూలకారణమనియెఱుఁగునది. మఱియునిట్టికథామూలకంబులగు నుపవాచకంబు లెన్నియేనియు బాలురకొఱ కిదివఱకే పుట్టియున్నవి. ఇట్లు పుట్టుటకు వ్యక్తుల యభిరుచులే ప్రధానకారణములు. అయిన నొకదాని యుత్కృష్టత యింకొక దానికిరాదు. ఉత్కృష్టతనుబట్టియే ప్రాశస్త్యము గలుగుచుండును. కావున నీసదుపదేశకథల గుఱించిప్రత్యేకముగాఁ జెప్పుటనవసరము. బోధకులే వీని ప్రాశస్త్యమును నిర్ణయింతురుగాక!

---

# విషయసూచిక

ఓమ్.

# సదుపదేశకథలు

## రెండవ భాగము

### శ్రీరాముఁడు—ఆతని తమ్ములు.

"అన్న తమ్మునియెడఁ దమ్ముఁ - డన్నయెడల
సమధికప్రేమ సూపిన - జగము మెచ్చు."

అయోధ్యాపురాధీశ్వరుఁడగు దశరథునకు, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులను నలువురు కుమారు లుండిరి. వీరిలో నొకరిపై నొకరికిఁ గల ప్రేమ వర్ణనాతీతమైనది. దశరథుని మూఁడవ భార్యయగు కైక వరముల ననుసరించి రాముఁడు - భార్యయగు సీతతోఁ బదునాలుగు వత్సరము లరణ్యమున వసించుటకుఁ బోయెను. అప్పుడు లక్ష్మణుఁడు గూడ రాముని విడిచి యుండఁజాలక వెంట నరిగెను.

రాముఁ డరణ్యమునకుఁ బోవునప్పుడు భరతుఁడు పురమున లేడు. ఆతఁడు తన మేనమామల యింటికిఁబోయి యుండెను. తన తల్లి వరముల కారణమున రాముఁ డడవికిఁ

బోయెననివిని, యాతఁడుమిగుల చింతించి, యట్లు చేసినందుకుఁ దల్లి నెంతయో దూషించి, రాముని దోడ్కొని వచ్చి పట్టాభిషిక్తునిఁ జేయుదునని పలికి బయలుదేరెను. రాముఁడు చిత్రకూటమునం దుండఁగా భరతుఁ డాతని సన్నిధికిఁ బోయి, పురమునకు రమ్మని వేడుకొనెను. కాని, రాముఁడు సమ్మతింపక తన పాదుక లాతని కిచ్చి పంపెను. భరతుఁడు పాదుకలను సింహాసనముపైఁ బెట్టి వాని కభిషేకముఁ జేసి, రామునకు మాఱుగాఁ దాను రాజ్యము పాలించెను. రాముఁ డరణ్యముల నుండి మఱల వచ్చువఱకు నాతఁడు మునివేష మును ధరించి కందమూలములఁ దినుచుఁ గాలముఁ గడపెను.

అరణ్యముల కేగిన లక్ష్మణుఁడు - రామునియందు మిగుల భక్తిఁబూని, యతనికి వనవాసాయాసమును మఱ పించుచు నహర్నిశలు సేవించి కృతార్థుఁ డయ్యెను. రాముని విడిచి లక్ష్మణుఁ డెప్పుడు నొక నిముసమయిన నుండువాఁడు గాఁడు. రాముఁడే తనకు గురుండనియుఁ బితృసముఁ డనియు, దైవ మనియుఁ దలంచి యుండెను. ఇట్లే శత్రుఘ్నుఁడు గూడ తన యన్నలయందుఁ బ్రేమయు - భక్తియుఁ బూని యుండెను. తన తమ్ములకుఁ దనయం దెంత భక్తియుండెనో, రామునకు వారియం దంత ప్రేమ యుండెను.



# 2 శునకము

“ తనకు ఘనత గూర్చు - మనుజున కే యెగ్గుఁ
దలఁచు నీచబుద్ధి - గల జనుండు. ”

ఒక యరణ్యమున నిరంతరము తపోవృత్తిని గాలము గడుపు మునీశ్వరుఁ డొకఁ డుండెను. ఆతని తపోవిశేషమున నాతని యాశ్రమ ప్రాంతమునఁ గల మృగములన్నియు మాలిమి గలిగి వర్తించు చుండును. అందొక్క శునక మెప్పుడును నాతనియందు భక్తిగలిగి, యెప్పుడు నెడఁ బాయక యుండును. మునీంద్రుఁడు గూడ దానియందు మిగుల దయగలిగి యుండెను. ఆమునిపుంగవుఁ డెచ్చటికిఁ బోయిన నచ్చటి కాకుక్క గూడఁ బోవుచుండును - అరణ్యమున నేదైన క్రూరమృగము దానిని దఱుముకొని వచ్చెనేని, యది మునియొద్దకుఁ బరుగెత్తుకొని వచ్చుచుండును. మునీంద్రుఁ డాశునకమును దన తపోమహిమచేఁ బెక్కు మృగములుగా మార్చి దానిని గెలిపించుచుండును. ఇట్లు ప్రతిదినము నాసారమేయ మనేక రూపములు దాల్చుచుఁ దుదకు శరభాకృతిఁ దాల్చి మదంబునఁ జరించుచుండెను.

ఇట్లుండ నొక దినమున శరభాకృతినున్న యది తన బుద్ధిని మఱవక తన మనంబున “ ఈమునీంద్రుఁడు తన మహిమచే నన్నెట్టి రూపముగామార్చవలెనన్ననట్లుమార్చు

చున్నాఁడు. ఇతనికి నాయందున్న యీకరుణ యెల్లప్పుడు నుండునో లేదో? కావున నేనీతని నిప్పుడు చంపితినేని నేనె ప్పుడు నిర్భయుండను," అని తలంచెను. దాని తలంపు మునీంద్రుఁడెఱింగి, దానిని విలోకించి "శునకమా! నీవు క్షుద్రబుద్ధిగలదానవని యెఱింగియుండియు నిన్నుఁ జెంతకుఁ జేర్చితిని. నేను నిన్నెంతో ప్రేమతోఁ జూచుచున్నను నా కెగ్గుసేయఁ దలంచితివి. కావున నీవెప్పటివలెఁ గుక్కవై యుండు" మని పలికెను. అంతట నయ్యది యెప్పటివలెఁ గుక్కయయ్యెను.

క. కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండఁబెట్టి ♦ శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టముఁగట్టిన
వెనుకటి గుణ మేలమాను? ♦ వినరాసుమతీ!



# 3 వింధ్యపర్వతము.

" పరుల యున్నతికి నసూయ - పడు జనుండు
దనకె భంగ మాపాదించు - కొనును జగతి."

గ్రహములును, సూర్యచంద్రులును, ననుదినము మేరుపర్వతమును జుట్టి దిరుగుచుండురు. దీనిఁగాంచి వింధ్య పర్వత మసూయవహించి " ఆసూర్యచంద్రులును, గ్రహములును, మేరుపర్వతముఁ జుట్టి యేల తిరుగవలయును? నాచుట్టు నేల తిరుగరాదు. దానికే యంత గౌరవముండవలయునా? నన్నుఁగొంచెమయినను సరకుసేయకున్నారు. ఇఁక సూర్యచంద్రుల సంచారమెట్లుండునో చూచెదఁగాక " అని తలఁచి, నభోమండలమంటునట్లు పెరిగెను. వింధ్య పర్వత మట్లుపెరుగుటచేత సూర్య చంద్రుల సంచారమున కడ్డుగలిగెను? లోకములు రేయుంబవళ్ళు తెలియక తల్లడిల్లుచుండెను.

అప్పుడు దేవతలందఱు నగస్త్యమహాముని పాలికిఁ బోయి నమస్కరించి యిట్లు సెప్పిరి "మునీంద్రా! వింధ్య పర్వతము ఆకాశమంటఁ బెఱిగి, సూర్యచంద్రుల సంచారము నిరోధించినది - నీవు మాయందుఁ గరుణించి దాని యున్నతినివారించి, లోకముల నుద్ధరింప వలయును" అంతట

దేవతా ప్రార్థితుఁడైనయగస్త్యుఁడు భార్యతో బయలుదేరి వింధ్య పర్వతము కడకు వచ్చి దాని నాలోకించి "ఓ పర్వత రాజమా! నేను దక్షిణదిక్కునకుఁ బోవలయును - నీవు మార్గమున కడ్డముగ నాకాశ మంటునట్లు బెపెరిగి యుంటివి. వృద్ధుఁడనగుటచే నేను దాటి పోవఁజాలను - కావున నీవు యథాప్రకారముగ నుండు'' మని పలికెను. అగస్త్యుఁడు మహామహిమగల తపశ్శాలి యగుటచే, నాతని మాట వినకయున్న శపించునేమోయను భయంబున నాతని వాక్యముల కెదురు చెప్పక నప్పర్వతరాజ మెప్పటివలె నయ్యెను. అప్పు డగస్త్యుఁడు దానిని దాటిపోవుచు "నేను మఱల వచ్చువఱకు నీవిట్లే యుండు" మని చెప్పి యాతఁ డరిగెను. ఆతఁడు మఱల నుత్తరదిశకు రాలేదు. వింధ్యపర్వత మెప్పటి వలెనే యుండెను.



# 4 యయాతి

“తననుదాను పొగడి - కొనునట్టి పురుషుండు
పుణ్యుఁడైన నేమి? పొందుఁ గీడు.”

పూర్వము చంద్రవంశములో యయాతి యను నృపాలుఁ డొక డుండెను. ఆతఁడు ధర్మసంధుఁడై ప్రజలను గన్నబిడ్డల చందమునఁ జూచుచు ధరాతలముఁ బరిపాలించెను. ఆశ్రితులఁ గాచెను - దీనులను రక్షించెను - అనేక దానములఁ గావించెను - లెక్కలేని క్రతువులఁ జేసెను - ఆతఁడు వృద్ధుఁడయిన పిదపఁ గుమారునకు రాజ్యమిచ్చి తపోవృత్తి నుండుట కరణ్యమునకుఁ బోయెను. బృందారకు లాతని తపమునకు మెచ్చి స్వర్గమునకుఁ దీసికొని పోయిరి.

ఒకనా డింద్రుఁ డొక గొప్ప సభ సేసెను. ఆసభ కనేక మునీంద్రు లరుదెంచిరి. భూలోకమునఁ బుణ్యము సేసి, స్వర్గమునకుఁ బోయినవా రెల్లరు నాసభయం దుండిరి. ఎవ్వరే పుణ్యము సేయుటచేత స్వర్గమునకు రాఁగలిగిరని యింద్రుఁ డొకప్రశ్న సేసెను. అందఱును “మేమాకార్యము సేసితిమి - మేమీకార్య మొనర్చితిమి - భగవంతుని దయ మాపై నుండుటచే స్వర్గమునకు రాఁగలిగితి” మని వినయముతో నింద్రునకు బదులు సెప్పిరి. కాని యయాతి మాత్ర మిట్లు వచించెను “మహేంద్రా! నేను ప్రజలను ధర్మబుద్ధితోఁ బరిపాలించితిని. నావలెఁ బుడమీతల మెవ్వరును

బరిపాలింపలేదు - బీదలను సాధువులను బోషించితిని. పెక్కు యాగములఁ జేసితిని. అనేక భూసురుల దానములచేఁ దృప్తులఁ గావించితిని - గొప్ప తపముఁ జేసితిని. యోగు లయినను నేనొనర్చిన యఖండ తపమును జేయలేరని నేను నొక్కి వక్కాణింపఁగలను. ఇట్టి ఘనకార్యములు నేను చేయుటచేతనే స్వర్గమునకు రాఁగలిగితిని'' ఈవిధముగ గర్వముతోఁ బలికిన పలుకులు విని మహేంద్రుఁడు యయా తిని విలోకించి "నీవు చేసిన కార్యము లన్నియు వచించితివి. ఇవి యన్నియు సత్యములే యైయుండవచ్చును. కాని యాత్మ స్తవము సేసికొనుట మహాపాపమని పెద్దలు చెప్పు వాక్య ములు నీవెఱుంగవా కాబోలు! ఎన్ని సత్కార్యములు చేసి నను నీవు గర్వమును మాత్రము విడువలేక యున్నావు. గర్వము గలవారు స్వర్గమున నుండుట కర్హులు గారు'' అని పలికి భూమింబడునట్లు ద్రోయించెను. అప్పుడు యయాతి క్రిందఁబడుచు "మహేంద్రా! నాగర్వము నన్నింత చేసినది. నాయందుఁ గరుణవహించి మధ్యమలోకమునఁ బుణ్యమతుల మధ్యనుండు నట్లనుగ్రహింపు''మని వేడెను. ఇంద్రుఁడు గరుణవహించి యాతఁడు గోరినట్లు చేసెను.

తా నెంతటివాఁ డయిననుఁ దాను చేసిన ఘనకార్య ములఁ జెప్పుకొని తన్నుఁ బొగడుకొనరాదు.

# 5 నాడీజంఘుఁడు

కం. ఉపకారికి నుపకారము
విపరీతము గాదుసేయ - వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు - నేర్పరి...

పూర్వము గౌతముండను భూసురుఁడు గలఁడు. అతఁడు స్వకులాచారధర్మమువిడిచి, బోయదానిని భార్యగాఁ జేసికొని, యనుదినమును గిరాతులఁగూడి, వేఁటకుఁబోవుచు మత్స్యమాంసములఁ దినుచుఁ గాలము గడపుచుండెను. ఈతనికిఁ గొందఱు వైశ్యులతో స్నేహముండెను. ఆవర్తకులు వ్యాపారము నిమిత్తము దేశాంతరములకుఁ బోవుచుండ నీబ్రాహ్మణుఁడుగూడ వారివెంట ధనార్జనమునకై బయలు దేరెను. వీరందఱును నొక మహారణ్యమార్గమునఁ బోవుచుండగా నొక మదపుటేనుఁగు వారిపైఁ గవిసెను. వారందఱును నలుదిక్కులకుఁ బాఱిపోయిరి. గౌతముఁడొక మార్గమును బట్టిపోయి, మిగుల విశాలమును, గుబురుగను నున్న యొక వటవృక్షము జూచి, దానిక్రింద విశ్రాంతుఁడై యుండెను. అప్పుడచ్చోటికి నాడీజంఘుఁడను పేరుగల బకము వచ్చి యాభూసురునిఁ జూచి "బ్రాహ్మణోత్తమా! నీవెచ్చటికిఁ బోవుచుంటివి? నిన్నుఁ జూచినయంతనే నాకు సంతోషము గలిగినది. నేఁడు నాయింటి కతిథివైతివని పలికెను.

అందులకు గౌతముండిట్లు పలికెను. “ నేనొక బ్రాహ్మణుఁ డను. చదువు సంధ్యలు లేక కులధర్మములు పరిత్యజించి, బోయత నాలిగాఁజేసికొని, ధనార్జనమునకై వైశ్యులవెంట వచ్చితిని. అరణ్యమున మాపైనొక మదగజము గవిసెను. అప్పు డందఱును నలుదిక్కులకుఁ బరుగెత్తుకొని పోయిరి. నేను పుణ్యవశమున నిచ్చటికిఁ జేరుకొంటిని. నా దారిద్ర్యమునకుఁ దోడుగా నిట్టి యవస్థగూడఁ బొందినాఁడ. ”

అనిన విని యబ్బక పూతనితో “ నీదారిద్ర్యమును నేను బాపెద. విచారమందవలదు. నాయొసంగునాతిథ్యము గ్రహింపు ” మని పలికి, మంచి చేపలను బక్వముచేసి వన్య ఫలములతో విందొసంగి సంతృప్తునిఁజేసెను. మరునాఁ డుదయమున నాడీజంఘుఁడు బ్రాహ్మణునిఁజూచి “ మిత్రుఁడు, బంగారము, రజతము, బుద్ధియు, ననునీనాలుగు దారిద్ర్యము వాపుటకుఁ గారణములని పెద్దలు చెప్పుదురు. ఇందులో నన్నిటికంటె స్నేహితుఁ డెక్కువవాఁడు. నేటినుండి నేనునీకు హితుఁడ నయ్యెదను. ఇచ్చటి కనతిదూరమున మధువ్రజ మను నగరమొకటి యున్నది. దానిని విరూపాక్షుఁడను దానవుఁడు పాలించుచుండును. అతఁడు నాకుఁ బ్రాణ మిత్రుఁడు. నీవు తిన్నగా నాతని కడకరిగి నేను పంపితినని చెప్పుము. అతఁడు నీకుఁ గావలసిన ధనంబొసంగును” అని చెప్పి యాపురమునకుఁ బోవు తెరువుఁ జూపెను. అంతట

గౌతముఁ డచ్చోటువాసి, నెమ్మదిగా మధువ్రజపురమును జేరిఁ విరూపాక్షునిగాంచి, నాడి జంఘుఁడు పంపగావచ్చిన బ్రాహ్మణుఁడ నని చెప్పెను. విరూపాక్షుఁడు బ్రాహ్మణుని వృత్తాంతమంతయు నరసి, యాతఁ డెట్టివాఁడయినను దన మిత్రుఁడగు నాడీజంఘునకు మిత్రుఁడగుటచే, సహాయము సేయవలయునని తలంచి, యాతనికి సంతృప్తిగా నాహార మును బెట్టించి, మోయలేనంత ధన మిచ్చి పంపెను. గౌతముం డందులకు మిగుల సంతోషమును బొందుచు, నాధనమును గైకొని మరల నాడీజంఘుఁడున్న స్థలముఁ జేరెను. ఆబక మాతని నాదరించి, తన మిత్రుని కతమున నాతఁడు భాగ్యవంతుఁ డయ్యెనని సంతసించి, మార్గాయాస మున డస్సియున్న యాతనిని భోజనాదికములఁ దృప్తుం జేసెను. అంత నారాత్రి బకము నిద్దుర వోవుచుండ, బ్రాహ్మణుఁడు మరుచటి దినము నాహారమునకై యోచించి "ఈ బకము మిగులఁ గ్రొవ్వియున్నది. దీని నాహారముగాఁ జేసికొందు" నని తలంచి, కృతఘ్నుఁడై యొక కఱ్ఱతో దానిం జంపి, యీకలఁ దీసివేసి, మాంసమును దీసికొని, డొక్క నచ్చటఁ బాఱవేసి పయనమయ్యెను.

అంత నక్కడ తెల్లవారిన యంతనే విరూపాక్షుఁడు కలఁత నంది, నాడీజంఘుఁడేమయిన యపాయమును బొంది యుండునేమో యని సంశయించి యతని సేమ మరయుటకు

భటులఁ బంపెను. ఆభటులు వచ్చి కొంకెక్కర యాకలు తీయఁబడి యుంటయు, డొక్క మాత్రము మిగిలి యుండుటయుఁ జూచి, కడు రయమునఁ బోయి, యావృత్తాంతమును విరూపాక్షున కెఱింగించిరి. బ్రాహ్మణుని మూలమున నాడీజంఘున కట్టి దుర్గతి కలిగినదని తలంచి, విరూపాక్షుఁ డాగౌతమునిఁ బట్టి తెచ్చుటకు భటుల నియోగించెను. భటులు నలుదెసలకుఁ బోయి, యొకచోట నాకృతఘ్నునిఁ బట్టుకొని, చేతులు విఱిచి కట్టి, విరూపాక్షుని కడకుఁ దెచ్చిరి. అంతట విరూపాక్షుఁడు "ఈపాపాత్ముని నాయొద్ద కేల తెచ్చినారు? వీనిం జంపి పాఱవేయుఁ"డని భటుల కాజ్ఞాపించెను. భటులు బ్రాహ్మణుని శరీరమును దఱిగి పురము వెలుపలఁ బాఱవేసిరి.

విరూపాక్షుఁడు మిత్రుఁడయిన నాడీజంఘుని మృతికిఁ జింతించుచుండ, దేవేంద్రుఁడు వచ్చి "రాక్షసేంద్రా! నీ హితుఁడగు నాడీజంఘుఁడు బ్రహ్మకు మిత్రుఁడు. ఆతనికై నీవు వగవవలదు. ఆతఁ డనుదినంబును దనకడ కరుదెంచుచుండవలయునని చతుర్ముఖుఁడు నిరంతరము గోరుచుండును. చతుర్ముఖుని కరుణవలన నాడీజంఘుఁడు సజీవుఁడైనాఁడు" అని చెప్పెను. ఇట్లు చెప్పుచుండఁగనే నాడీజంఘుఁడు వచ్చి, విరూపాక్షునకు నయనపర్వ మొనర్చెను. నాడీజంఘుఁడు

తన మూలమున బ్రాహ్మణుఁడయిన గౌతమున కట్టి గతి ప్రాప్తించెనని విని, యాతఁడు పునర్జీవితుఁ డగునట్లు వరం బిమ్మని యింద్రుని వేఁడెను. ఇంద్రుఁ డట్టి వరమును బ్రసా దింపఁగనే గౌతముఁడు లేచి వచ్చెను. నాడీజంఘుని పలు కుల ననుసరించి విరూపాక్షుఁడు మరల గౌతమునకుఁ గావల సినంత ధన మిచ్చి పంపించెను.

బాలకులారా! చూచితిరా! నాడీజంఘుఁ డెట్టి ధర్మపరుఁడో! ఆతని కపకారము సేసెనని యైనఁ దలంపక గౌతమున కుపకారమునే యొనర్చెను.



# 6 కార్తవీర్యార్జునుఁడు

"బలము తనకుఁ జాల - గలదని గర్వంబు
పడుట తుదకు భంగ - పడుటకొఱకె"

పూర్వము కార్తవీర్యార్జునుఁడను రాజు మాహిష్మతీ పురమును బాలించుచుండెను. ఆతఁడు దత్తాత్రేయునకు శిష్యుఁడై, బలపరాక్రమములయందుఁ దనకు సాటియెవ్వరును లేక చరించుచుండెను. లంకాపురమున కధిపతియు, బ్రహ్మచేతఁ బెక్కువరములఁ గాంచినవాఁడును నగు రావణుఁడే యీతనిపేరు విన్న భయమందు చుండువాఁడు.

ఇట్లుండఁ గార్తవీర్యార్జునుఁడొక సమయమున సేనా సమేతుఁడై యెచ్చటికో పోవుచు మార్గమధ్యముననున్న జమదగ్ని యాశ్రమమునకుఁ బోయెను. జమదగ్ని - కార్తవీర్యుని ననేక విధంబుల గౌరవించి, యానాఁడు తనచే నొసంగఁబడు విందుఁగైకొని పొమ్మని యడిగెను. రాజేంద్రుఁడా మహర్షినిఁజూచి 'మునీంద్రా! నీవొనర్చిన గౌరవమునకు నే నెంతయు సంతసించితిని. నేనొక్కఁడనే యిటకు రాలేదు. చతురంగ బలములతో వచ్చి యుంటిని. ఇంత మందికి నీ వాతిథ్యమెట్లిచ్చెద?" వని యడిగెను. అందుకు జమదగ్ని "రాజేంద్రా! నీ విందుకై సంశయింపఁ బనిలేదు. ఎంత మందికైనను విందుసేయుదు'' నని పలికెను. రాజేం

ద్రుఁడు సమ్మతించెను. అంతట జమదగ్ని తనయొద్దనున్న కామధేనువు మహిమచేఁ, గార్తవీర్యునకును, ఆతని పరివారమునకును - అనేక పదార్థములతో విందుఁ జేసెను. భోజనములయిన పిదప, జమదగ్ని యిట్లు సేయుట కాతని యొద్దఁ గామధేను వుండుటయే కారణమని తలంచి, నెమ్మదిగా నమ్మునిం జేరి కార్తవీర్యుఁడు "మునీంద్రా! నీకుఁగావలసినన్ని గోవుల నొసంగెదను. నీయొద్దనున్న కామధేనువు నాకి"మ్మని యడిగెను. ఆతండును 'నృపాలా! కామధేనువు మాయట్టి తపోధనులయొద్దఁ దప్పక యుండవలయును. మాకదియే ధనము. దీనిని నేనొరుల కొసంగఁజాల"నని పలికెను. కార్తవీర్యుఁడెంత బ్రతిమాలినను జమదగ్ని సమ్మతింపలేదు. అంతట కార్తవీర్యుఁ డాసురభిని బలవంతముగఁ గొనిరమ్మని మంత్రుల కాజ్ఞాపించెను. నృపాలుని యాజ్ఞననుసరించి, మంత్రులు కామధేనువును బలవంతముగఁ దెచ్చుచుండ జమదగ్ని 'వలదు వల'దని యడ్డమువచ్చెను. కాని, మంత్రులూరుకొనక యమ్మునింగొట్టి సురభిం దెచ్చిరి. కార్తవీర్యుఁడు సురభితోఁ బరివారయుతముగా నిజపురమునకుఁ జేరెను.

ఇది యంతయు జరిగినప్పుడు జమదగ్నికుమారుఁడైన పరశురాముఁ డాశ్రమమున లేఁడు. ఆతఁ డాశ్రమమునకు వచ్చి తండ్రివలన వృత్తాంతమంతయు విని, రుద్రుని లీల

గోపముఁబూని పరశుధరుఁడై మాహిష్మతీ పురమునకుఁ బోయి కార్తవీర్యుని యుద్ధమునకుఁ బిలిచెను. కార్తవీర్యుఁడు పరశురాముని హేళనగాఁ బలికి తన ప్రతాపమంతయుఁ జెప్పుకొనెను. పరశురాముఁడు వానిని యుద్ధమునందుఁ జంపి, కామధేనువును మఱలఁ దీసికొనివచ్చి తండ్రికి సమర్పించెను.

తనకంటెఁ బరాక్రమవంతుఁడు లేఁడని గర్వించి యట్టి యకార్యము సేయుటవలనఁ గార్తవీర్యార్జునుఁడు తుదకుఁ బరశురామునిచే వధింపఁబడెను.



# 7 ప్రహ్లాదుఁడు

"క॥ ఇందుఁగలఁ డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే."

పూర్వము హిరణ్యకశిపుఁడను రక్కసుఁ డొకఁడుండెను. ఆతని పరాక్రమమునకు దేవత లెల్లరును భయపడు చుందురు. వాని తమ్ముఁడగు హిరణ్యాక్షుని శ్రీహరి వరాహ రూపమున వధించెను. ఆపగఁ దీర్చుకొనుటకు హిరణ్యకశిపుఁడు - సాధులను - గోవులను - మునులను - భక్తులను హింసింపుఁడని భటుల కాజ్ఞాపించెను. ఇట్లు భటుల కాజ్ఞ యిచ్చి యతఁడు బ్రహ్మంగూర్చి తపము సేయుటకు మందరాచలమున కరిగెను. ఆతఁడు తపమునకుఁ బోవునప్పటి కాతని భార్యయగు లీలావతి గర్భిణియై యుండెను. హిరణ్యకశిపుఁడు నగరమున లేడని, దేవేంద్రుఁడు వచ్చి లీలావతిని జెఱగొని పోవుచుండఁగా, నారదుఁడు వచ్చి యామెను విడిపించి తన యాశ్రమమునకుఁ దీసికొని పోయెను. లీలావతి నారదుని యాశ్రమమునందే యొక కొడుకును గనెను. నారదుఁ డాతనికిఁ బ్రహ్లాదుఁడని పేరు పెట్టెను.

హిరణ్యకశిపుఁడు బ్రహ్మచేతఁ బెక్కువరములు వడసి పురమునకు వచ్చిన యంతనే, నారదుఁడు పుత్రవతియగు లీలావతిని దోడ్కొని వచ్చి యాతని కప్పగించెను.

ప్రహ్లాదుఁడు శుక్లపక్ష చంద్రుని విధమున దినదిన ప్రవర్థమానుఁ డగుచుండెను. అతఁడు బాలుఁడైనను నొక్కొక్క సమయమునఁ బిచ్చివానివలె శ్రీహరిం గూర్చి పాడుచు భాషించుచుఁ బరుగెత్తుచుండును. ఒక్కొక్కసమయమునఁ దనలోఁ దానే మాటలాడికొనుచుండును. ఇది యంతయుఁ దండ్రి చూచి, కుమారుఁడు మూఢుఁడగుచున్నాఁడని తలంచి, చండామార్కులను గురువులఁ బిలిచి, వానికి విద్య నేర్ప నియోగించెను. గురులు ప్రహ్లాదునకు విద్య నేర్పుచుండిరి. కొన్నాళ్లు గడచిన పిమ్మట హిరణ్యకశిపుఁడు కుమారుఁ డేమి చదివెనో చూచుటకై, వానిని బిలిపించి ముద్దాడి, తొడపైఁ గూర్చుండఁబెట్టుకొని, యేమి సదివితివని యడిగెను. "ఈ ప్రపంచము సర్వము శ్రీహరిమయమని నేను గ్రహించితి'నని కొడుకు బదులు సెప్పెను. శ్రీహరి హిరణ్యకశిపునకు విరోధి. తన విరోధింగూర్చి కొడుకున కెవ్వరు బోధించిరాయని యాతఁడు సంశయించెను. చండామార్కులు ప్రహ్లాదునిఁగోపించి, యాతనిందీసికొని పోయి నీతికుశలునిగాఁజేసి తోడ్కొని

వత్తునని పలికి, తోడ్కొనిపోయెను. గురువులెంత బోధించి నను బ్రహ్లాదుఁడు హరిందలంచుట మానలేదు. ఆతఁ డట్లుండుటయేగాక తోడి బాలురనుగూడ హరిభక్తులుగాఁ జేసెను. ప్రహ్లాదుని మాటలువిని దానవకుమారులు తమ పుస్తకముల నావలఁ బాఱవేసి, హరిని భజింప సాగిరి. ప్రహ్లాదునిమనస్సుఁ ద్రిప్పుటకు గురువుల కశక్య మయ్యెను. గురువు లాసంగతి దానవేంద్రున కెఱింగించిరి. హిరణ్యకశిపుఁడు కుమారుని శిక్షించియైన యాతని చిత్త మును ద్రిప్పఁదలఁచి, భటులంబిలిచి, యతఁడు హరిని స్మరించుట మానువఱకును శిక్షింపుఁడని యాజ్ఞాపించెను. రాక్షసులు ప్రహ్లాదుని నేనుంగులచేతఁ ద్రొక్కించిరి. అగ్ని లోఁ ద్రోసిరి. పాములచేఁ గఱపించిరి. సముద్రములోఁ బడవేసిరి. పర్వతాగ్రములనుండి క్రిందికిఁ బడద్రోబ్బిరి. ఎన్ని చేసినను బ్రహ్లాద కుమారుఁడు హరిభక్తిని విడువలేదు. ఆతనిశరీర మావంతయుఁ గందలేదు. రాక్షసులకు విసుగు పుట్టి యక్కుమారుని దండ్రి యొద్దకుఁ దీసికొనిపోయి మేమిఁక నీతనిని శిక్షింపఁజాల ” మని వచించిరి. అప్పుడు దానవేంద్రుఁడు కొడుకుంగాంచి నిప్పులుప్పతిల్లు చూపుల నిట్లనెను. “ ఓరీ! నాయాజ్ఞలేనిదే సూర్యుఁడెండఁగాయఁడు. పవనుండు వీవఁడు. యముఁడు జీవులను.జంపఁడు. మూఁడుజగ ములును నాకు భయమందుచుండును. శ్రీహరి నాకువిరోధి

మనకులధర్మము నేలపాలుగావించి నీవాహరినేలతలంచెదవు? నీకెవ్వఁడు దిక్కగునోచూచెద. నీవెవ్వనిబలము నమ్ముకొని నామాట వినకయుంటివి? " ఆమాటలకుఁ బ్రహ్లాదుఁ డిట్లుపలికెను. " తండ్రీ! నీవు శాంతించి నావాక్యముల వినుము. నీవు లోకములన్నియు జయించితివి గాని, నీమనస్సునుమాత్రము జయింపఁజాలక యున్నావు. నీశత్రువులు నీమనస్సునందే యున్నారు. నీవువారిని జయించితివేని, నీకు విరోధియే యుండఁడు. చిన్నవాఁడను. చెప్పితినని కోపింపవలదు. నీచిత్తమును బదిలపఱచుకొనుము. హరినిసేవింపుము. శుభములొదవును. "

ప్రహ్లాదుని మాటలకు హిరణ్యకశిపుఁడు మఱింత యాగ్రహమునుబూని " ఓరీ! నిన్నుఁజంపెదనన్నను భయపడక హరిందలంచుచున్నావు. నాతమ్మునిఁ జంపిన యాహరికొఱకు జగములన్నియు వెదకితిని. ఎందును గనఁబడలేదు. వాఁడెక్కడున్నాఁడో చెప్పుము. వానిని నిన్నుఁగూడ వధించెద " ననినఁ బ్రహ్లాదుఁ డిట్లనిచెప్పెను. " తండ్రీ! ఆశ్రీమన్నారాయణుఁడిచ్చటఁగలఁడు - అచ్చట లేడు- అను సందేహము వలదు. ప్రపంచమంతయు నిండియున్నాఁడు. నీవెచ్చటఁజూడఁ దలంచిన నచ్చటనే కలఁడు. " ఆవాక్యములు విని హిరణ్యకశిపుఁడు కోపము రెట్టింప "ఓరీ! దుర్మతీ!

ఆహరి యెక్కడఁ జూచిన నక్కడ నుండునుగా? కానిమ్ము. ఈ సభాస్తంభమున వానిం జూపఁగలవా? యనెను "నీవు కోరిన ట్లామహాత్ముఁ డీసభాస్తంభమున నుండు"నని ప్రహ్లాదుఁడు బదులు చెప్పెను. అప్పుడు హిరణ్యకశిపుఁడు లోకముల నన్నింటియు మ్రింగివేయునంతటి యాగ్రహముతో "ఏడీ? శ్రీహరి నిందుఁ జూపు"మని పలుకుచు నఱచేతితో సభాస్తంభమును గొట్టెను. ఆక్షణముననే శ్రీహరి నరసింహరూపమున స్తంభమునం దావిర్భవించి వెలికివచ్చి హిరణ్యకశిపునిఁబట్టి, చంపి, ప్రహ్లాదుని రక్షించెను.



# 8 మూషికము—మార్జాలము

"శత్రువులను నమ్మి - సంచరించుట తగ
దెంత చెలిమియున్న - నెఱిఁగియెఱిఁగి"

పూర్వ మొక మహారణ్యమున నొక మఱ్ఱిచెట్టు
క్రింద నొక మూషికమును, చెట్టుపై నొక మార్జాలమును
నివసించు చుండెను. ఆప్రదేశమున కనుదినము నొక వేఁట
కాఁడు సందెవేళ వచ్చి వలనొడ్డి పోయి తెల్లవారుసరికి మరల
వచ్చి యందుఁ బడిన పక్షులు మొదలయిన వానిని దీసికొని
పోవుచుండును - ఇట్లుండ నొక దినమున నాహారము
కొఱకు వెదకుకొనుచున్న పిల్లి యావలలోఁ బడెను. అది
చూచి భయము విడిచి మూషిక మెరకొఱకు బయలు
దేరెను - ఆసమయమున దానికొక గూబయు - ముంగియు
నెదురుపడగా, భయమంది వలలోఁ జిక్కియున్న పిల్లిని
సమీపించి యిట్లు పలికెను-"ఓమార్జాలమా! ఈవల కొఱకి
వేసి నీకు మేలుఁ గూర్చెదను - నీకు నేనీ యుపకారము
చేసినందులకు నీవు నాతో నెప్పుడును మైత్రిఁ గలిగి
యుండుము. ముంగికిని గూబకును భయం బంది యిట్లు పరు
గెత్తుకొని వచ్చితి - నీప్రక్కనున్న నాకు భయము పోవును"
అందులకు మార్జాలము మూషికముతో "నీవు నాకు మేలు
చేయుటకు వచ్చితివి - నేను దానిని మఱచిపోవుదునా?

నీవు నాదగ్గఱ నుండుము. ముంగియు గూబయు నిన్ను నేమియు సేయఁజాలవు'' అని చెప్పెను. అంతట మూషికము మార్జాలము చెంతఁ జేరి యుండెను - గూబయు ముంగియు నక్కడకు వచ్చి, పిల్లి సమీపమున నుండుటచే నెలుకను బట్టఁజాలక తిరిగి పోయెను- మూషికము సంతోషమందెను. కాని వలత్రాడు గొఱకక యటునిటుఁ దిరుగుచుండెను. మార్జాలము దానిం జూచి "నీవేల వలత్రాళ్లఁ గొఱకక యుంటివి? ఆలస్య మేల చేసెదవు? నేనొనర్చిన మేలు మఱచి యుండుట నీకుఁ దగదు" అని పలికెను - ఆమాటలకు మూషికము ''నీకు ద్రోహము సేయఁదలఁచి నేనాలస్యము సేయుట లేదు – వేఁటకాఁడు మన కంటికిఁ గనఁబడిన యంతనే నీకు మేలుచేసెద. ఇప్పుడే నిన్నుఁ దప్పించితినేని యేమికీడు సేయుదువో యని నాకు భయమగుచున్నది. ఈ వలత్రాళ్లు నేను గొఱికిన యంతనే వేటకాని రాకఁ జూచి నీవు చెట్టుపై కేగుము. నేనును నాబిలమును బ్రవేశించెదను. నన్ను నమ్ము"మని బదులు చెప్పెను. ఇట్లీ రెండును మాటలాడుకొను చుండఁగాఁ గుక్కలను వెంటఁబెట్టుకొని వేఁటకాఁడు వచ్చుచుండెను. అప్పుడు మార్జాలము భయమందుచు "అదిగో వేఁటకాడు వచ్చుచున్నాడు, వానింజూచిన నాకు మిగుల భయమగుచున్నది, రక్షింపు'' మనెను. అంతట నెలుక మిగుల తొందరగా వలత్రాళ్లను

గొందికి తన బిలములోనికిఁ బోయెను. పిల్లియు నీవలఁ బడి చెట్టెక్కెను. వేటఁకాఁడు వచ్చి వలలోనున్న కొన్ని పక్షులను బట్టికొని పోయెను. ఇది యంతయు నెలుక పొంచి పొంచి చూచుచుండెను. అప్పుడు చెట్టుపైనున్న పిల్లి దానిం జూచి "నాతో స్నేహముగా నుండుదునని చెప్పితివి. నీవు నన్నుఁగూర్చి భయమందవలదు - నీవు నాకు మేలొనర్చితివి - నీవు నన్ను నమ్మకపోవుట మంచిది కాదు - నీవు గూడ నాసంపద ననుభవింపవలయును - రమ్ము. నాతోఁ గలసి యుండు"మనెను. ఆమాటలకు మూషికము "వీరు శత్రువులు - వారు మిత్రులు - అను సంగతిఁ గనిపెట్టుట మిగుల కష్టము. కొందఱు మిత్రులవలె నుండి కీడు సేయుచుందురు. కావున నీతోఁ గలసియుండుట నాకు మంచిది కాదు - బలవంతులయిన విరోధు లొక్కొక్క సమయమున స్వలాభమునకై యితరులకు లోఁబడి యుందురు. శత్రువుని యెడల నెప్పుడును స్నేహము సూపరాదు - ఈ విషయ మట్లుంచుము. పిల్లుల కాహార మెలుకలు. నిన్ను నమ్మి నేనెట్లు వత్తును? రాత్రి యంతయు నీవు వలయందుఁ జిక్కియుండుటచే నీ కాకలిబాధ యెక్కువగా నుండును. అందుచేత నన్నుఁ బిలుచు నీకు మోసపడి రాను. నీమూలమున నేను బ్రదికితిని. నామూలమున నీవు బ్రదికితివి. ఇట్లు గలిగిన స్నేహమే చాలును - నిన్ను నమ్మి యున్నచో

నెప్పటికైన నాకు మోసమే. నమ్మఁదగని వారిని నమ్మ రాదు. నీవంటి వారిని నమ్మక నేను జీవించెద. వేఁటకాని వంటివారిని నమ్మక నీవు సుఖింపుము''

ఎలుక పలుకులకు, పిల్లి సిగ్గునొంది యూరకొనెను. మూషిక మాస్థలము విడిచి మఱియొక చోటికిఁ బోయి సుఖముగా నుండెను.



# 9 దుర్యోధనుఁడు

"ఒకరి కెగ్గుసేయ - నూహించి యత్నించు
చెనటి తనకుఁ దానె - చెడుట నిజము''

భరతవంశమునఁ బాండురాజనియు - ధృతరాష్ట్రుఁడనియు నిరువురు రాజులు గలరు. పాండురాజు కుమారులను పాండవు లనియు, ధృతరాష్ట్రుని కుమారులను గౌరవు లనియుఁ బిలుతురు. ధర్మజ భీమార్జున నకుల సహదేవులు పాండవులు. దుర్యోధనుఁడు దుశ్శాసనుఁడు మొదలగువారు కౌరవులు. పాండవులకుఁ జిన్ననాడె తండ్రి గతించుటచేత ధృతరాష్ట్రుఁడే వారినిఁ బెంచి పెద్దవారిగఁ జేసెను. పాండ

వులు చిన్నతనమునుండియు ధర్మగుణులై యుండిరి. అందు చేత దుర్యోధనుఁడు వారియం దసూయ వహించి యుండెను. ఎప్పుడును వారి కేదోవిధముగ హాని సేయుటకే తలంచుచుండెను. ఇట్లుండ ధృతరాష్ట్రుఁడు పాండవుల కింద్రప్రస్థపుర రాజ్య మిచ్చి యచ్చటికిఁ బంపించెను. ధర్మరాజు మంచి బుద్ధిగలవాఁడగుటచేత రాజులందఱును నాతనికి విధేయులై యుండిరి. అందుచేత నాతఁడు రాజసూయమను పేరుగల గొప్ప యాగ మొకటి చేసెను. దానిని జూచుటకుఁ బెక్కుమంది రాజులు వచ్చిరి. పాండవుల వైభవము దుర్యోధనునకుఁ గన్ను గుట్టించెను. రాజసూయముఁ జూచినది మొదలు పాండవుల సంపద నెట్లయిన హరింపవలయు నని దుర్యోధనునకు దుర్బుద్ధి పుట్టెను.

అంతట నాతఁడు ధర్మరాజును జూదమాడుట కాహ్వానించెను – ఆతఁడు ద్యూతప్రియుఁడగుటచే నందుకు సమ్మతించి వచ్చెను – అది మాయజూదము. దుర్యోధనుని పక్షమున నాతని మేనమామయగు శకుని పందెమొడ్డెను. ఆమాయజూదమునఁ బాండవులు తమ సర్వరాజ్య శ్రీలను గోలుపోయి యరణ్యాజ్ఞాత వాసములు సేయుటకుఁ బోయిరి. జూదమునకు ముందు వారేర్పఱచుకొన్న యొడంబడిక ననుసరించి పాండవులు సమయము దీర్చి వచ్చి, తమ యర్థ

రాజ్యముఁ దమ కీయవలసినదని దుర్యోధను నడిగిరి. కౌరవు లందులకు సమ్మతింపక పోవుటచేత వారికిఁ బాండవులకు గొప్ప యుద్ధము జరిగెను. దీనినే భారతయుద్ధ మందురు. ఆయుద్ధమున దుర్యోధనుఁడు తన పుత్రులతోడను, దమ్ముల తోడను - నేలఁ బడెను. పాండవులు విజయలక్ష్మిని గైకొనిరి. ధర్మరాజు హస్తినాపుర సామ్రాజ్యమున కభిషిక్తుఁ డయ్యెను.

బాల్యము నుండియుఁ బాండవులను జెఱుపఁదలఁచిన యాదుర్యోధనుఁడు తుదకు ఊరుపేరు లేకుండఁ దానే చెడిపోయెను.



# 10 ధ్రువుఁడు

'భక్తిగలుగు చోటఁ - బ్రాయ మక్కఱలేదు
చిత్తశుద్ధి యొకటి - చేరియున్న'

భగవంతుని సేవించుటకు వయస్సుతోఁ బనిలేదు - తన్ను నిశ్చలమైన మనస్సుతో సేవించిన వారిని శ్రీహరి రక్షించితీరును - పూర్వము ఉత్తాన పాదుఁడను నృపాలు డొకఁడుగలఁడు. ఆతనికి సునీతి - సురుచి యను నిరువురు భార్యలుగలరు. సునీతికి ధ్రువుడు - సురుచికి ఉత్తముఁడు నను కొడుకులు పుట్టిరి. ఉత్తాన పాదునకు సురుచియం దెక్కువ యను రాగముండెను. ఆతఁడెల్లప్పుడు నామె మందిరమునందే యుండును. ఒకనాఁడు ఉత్తానపాదుఁడు సురుచిమందిరమున నుత్తమునిఁ దొడపైఁ గూర్చుండఁ బెట్టు కొని ముద్దాడుచుండెను. ఆ సమయమున నచ్చటికి సునీతి పుత్రుఁడయిన ధ్రువుఁడు వచ్చెను. ఉత్తముఁడు తన తండ్రి తొడపై గూర్చుండుటఁజూచి, తానుగూడ నట్లు కూర్చుండ వలెనని ధ్రువుఁడు తండ్రిని సమీపించుచుండ, యచ్చట నున్న సురుచి యాకుమారునిఁజూచి "నీవు తండ్రియంకమున గూర్చుండుటకు సంభ్రమింపవలదు. నీకట్టి భాగ్యమున్నచో నా కడుపుననే పుట్టియుందువు. ఇప్పుడైనను నీకట్టిభాగ్యము వలయునేని శ్రీహరి నాశ్రయింపు" మని పలికి యావలకు

లాగెను. ఉత్తానపాదుఁ డామెను వారింపలేదు. సవతితల్లి చేత నావిధమున నవమానింపఁబడి యేడ్చుచు ధ్రువుఁడు తన తల్లియొద్దకుఁబోయి యా వృత్తాంతము వినిపించెను. ఆమెగూడ నందుకు విచారించి, భగవంతునే సేవింపుమని పలికెను.

అంతట ధ్రువుఁడు తల్లి యాశీర్వచనముఁ బొంది, శ్రీహరిని గూర్చి తపముసేయుటకు బయలుదేరెను. మార్గ మధ్యమున నాతనికి నారదుఁడు కనుపించి "పసిబాలుఁడవగు నీ వెక్కడ ? శ్రీహరినిగూర్చి తపముసేయుట యెక్కడ ? గృహమునకుఁ బొమ్ము" అని యనేక విధములఁ జెప్పెను. ధ్రువుఁడందుకు సమ్మతింపక శ్రీహరిని గొలుచు మార్గముఁ జెప్పుమని నారదుని పాదములపైఁ బడెను. నారదుఁడు బాలుని యెడలఁ గరుణించి శ్రీహరి నుపాసించు మంత్రము నుపదేశించెను.

తరువాత ధ్రువుఁడు మధువనమునకుఁబోయి యతి నిష్ఠతో శ్రీహరినిగూర్చి తపముసేసెను. ధ్రువుఁడుసేయు చున్న తపమునకు శ్రీమన్నారాయణుఁడు మెచ్చి, తన సం దర్శన మొసంగి యతనికిఁ బెక్కువరము లిచ్చెను. ఇట్లు శ్రీహరి కరుణవడసి నిజపురమునకుఁబోయిన ధ్రువునిఁజూచి ఉత్తానపాదుఁ డెంతయో సంతోషించెను. సునీతి కుమారుని

గాఁగిలించుకొనెను. సవతి తల్లియగు సురుచియు మహానంద మును బొంది హరికరుణ వడసినవారి కేవిధమయిన కొఱఁతయు నుండదని పలికి కౌఁగిలించుకొనెను. ఉత్తానపాదుఁడు వృద్ధుఁడైన పిదప ధ్రువుఁడనేక వత్సరములు రాజ్యము ధర్మ మార్గమునఁ బరిపాలించి, పెక్కు క్రతువులుచేసి తుదకు శ్రీహరికరుణవలన దివ్యమైన పదవినందెను.



# 11 కాపవ్యుఁడు

"గౌరవా గౌరవములకుఁ - గారణంబు
గుణ మొకండె యగుం గాని - కులముగాదు"

పూర్వము పారియాత్రాచల ప్రాంతభూమిని - కాప వ్యుఁడను నొక బోయవాఁ డుండెను. వాడస్త్రశస్త్రవిద్యల యందు నిపుణుఁడు. వాఁడు కులమునకు బోయవాఁడైనను సకల సద్గుణములచే విరాజిల్లు చుండెను. వృద్ధులయిన తల్లి దండ్రుల కే కొఱంతయు సంభవింపకుండ నిరంతరము పరి చర్యలు సేయుచుండును. ఆప్రాంతమున నాశ్రమములు గట్టికొని తపోవృత్తినున్న మునులకు మృగబాధలు గలుగ

కుండఁ గాపాడుచు, వారికిఁ గావలసిన ఫలములు మొదలగు నవి యిచ్చుచుఁ గాపవ్యఁడు వారి కృపకుఁ బాత్రుఁడై యుండెను.

ఇట్లుండ నతని సద్గుణములకు మెచ్చి యాప్రాంత మున నున్న జనులు వానిని దమ కధిపతిగాఁ జేసికొనఁగోరి, వాని కడ కేగి తమ యభిప్రాయమును దెలిపిరి. వారి యభి ప్రాయ మెఱిఁగి కాపవ్యఁ డిట్లు పలికెను. "బాలవృద్ధ స్త్రీమునిజనంబుల కెవ్వరును నెగ్గు సలుపరాదు. తన పయి ముందెవ్వఁడు గనయకుండ నెవ్వఁడు నోరుపయిం గవయరాదు. స్త్రీలఁ జెఱపట్టరాదు. ఎట్టి మృగములలో నైనను నాడుదానిం జంపరాదు. గోబ్రాహ్మణులను సంకట పెట్టరాదు - గోబ్రాహ్మణ సంరక్షణార్థము యుద్ధము సేయవలెను. దానివలనఁ బుణ్యమొదవును- ప్రజ లకు బాధలు గలిగించి ధన మార్జించుట పాపము. ఇట్టి ధర్మము లన్నియు మీరు బాగుగ నెఱింగి, నేఁజెప్పు తెఱం గున మీరుందురేని నేను మీరు వచించిన ట్లుండెద" అని పలికిన విని వారందఱు నతని వాక్యములకు సమ్మతించి యాతనిం దమకుఁ బాలకునిగాఁ జేసికొనిరి.

—⁂—

# 12 భగీరథుఁడు

"కార్యదీక్షయున్న - ఘనకార్యమైనను
సఫలమగును గార్య - సరణియిట్లు"

పూర్వము సగరుఁడను చక్రవర్తి యశ్వమేధ యాగము సేయఁదలచి సలక్షణమైన యొక యుత్తమాశ్వమునకు బిరుదు పట్టగట్టి దానికిఁ దగిన యంగరక్షకుల నియమించి, భూప్రదక్షిణము సేయుటకు విడిచెను- మహేంద్రుఁడాహయమును బట్టికొని, పాతాళలోకమునకుఁ దీసికొనిపోయి, గాఢసమాధియందున్న కపిలమహాముని సమీపమునఁ గట్టివైచి తనలోకమునకుఁ బోయెను. ఈసగరునకఱువదివేలమంది పుత్రులు గలరు. వీరందఱును నాహయము వెంట నంగరక్షకులుగాఁ బోయిరి - వారు మరలి వచ్చి సగరునితో నశ్వము కనఁబడలేదని చెప్పిరి. సగరుఁడు వారిపై నాగ్రహించి, యశ్వమును బట్టి తెండని మరలఁ బంపెను. వారు భూలోక మంతయు గాలించి తుదకుఁ బాతాళలోకమున కేగి, యచ్చటఁ దపస్సు చేసికొనుచున్న కపిలుని, నాతని ప్రక్కనున్న యశ్వమును జూచి, యాతఁడే హయము నపహరించినవాఁడని తలంచి, యనేక విధముల దూషించిరి - దూషించుటయే గాక పైఁబడి కొట్టిరి. అప్పుడు తపస్సుఁ జాలించి యమ్మునీంద్రుఁడు కోపదృష్టిం జూచిన యంతనే వారందఱును భస్మమయిరి.

తరువాతఁ గొంతకాలమునకు సగరునివంశమున భగీరథుఁడు జన్మించెను. ఆతఁడీ సాగరుల వృత్తాంతమంతయు విని వారికిఁ బుణ్యలోకములఁ గూర్చుటకై బ్రహ్మనుగూర్చి తపస్సుచేసెను. బ్రహ్మ యాతనికిఁ బ్రసన్నుఁడై "నీవు గంగను నీముత్తాతల భస్మరాసులపైఁ బ్రవహింపఁజేసితివేని వారు పుణ్యలోకములకుఁ బోవుదురు." అని పలికెను. భూలోకమునకు గంగను దెచ్చుటయన్న సామాన్యమైన పనిగాదు. భగీరథుఁడందుకై శివునిఁగూర్చి తపముసేయఁగా, నతఁ డీతని తపమునకు మెచ్చి తన జటాజూటమునందున్న గంగయందొక బిందువును విడిచెను. ఆ బిందువు ప్రవాహరూపమున వచ్చుచుండ మార్గమున ననేక విఘ్నములు కలిగినవి. కాని భగీరథుఁడు మాత్రము పట్టుదలను విడువలేదు. అప్పుడు దేవతలందఱు నీతనికిఁ బ్రత్యక్షమై యాగంగాజలమును సాగరుల భస్మరాసులపైఁ బ్రవహించునట్లు చేసిరి. సాగరులు స్వర్గముఁజేరిరి. గంగ భూలోకమునకు భగీరథునిచేఁ గొనిరాఁబడిన కారణమున భాగీరథియనిపిలువఁబడెను.

భగీరథుఁడట్టి గట్టి ప్రయత్నము సేయుటచేతనే లోకమున 'భగీరథ ప్రయత్న'మను లోకోక్తి ప్రసిద్ధమైనది.



# 13 సిరియాళుఁడు

'సూనృతంబు సర్వ - శుభముల సమకూర్చు
భవము మాన్చు మోక్ష - ఫలము నిచ్చు'

సిరియాళుఁడను భూపాలుఁ డొకఁడు గలఁడు. ఆతఁడు శివభక్తుఁడు. ధర్మపరుఁడు. అను దినముఁ దన ప్రక్కనొక్క యతిథియైన లేకుండ భోజనము సేయువాఁడు గాడు. ఒక నాఁడు పరమేశ్వరుఁ డానృపాలుని చిత్తమును బరీక్షింపఁ దలఁచి, యాతని యింటి కతిథు లెవ్వరును రాకుండఁ జేసెను. ఎంత ప్రొద్దెక్కినను నొక్క యతిథియైన రాజేంద్రుని గృహామునకు రాఁడయ్యెను. ఎవ్వరైన నతిథులు లభింతురేమో యని సిరియాళుఁడే నగర మెల్లయెడల వెదకుటకు బయలుదేరెను - ఆసమయమునఁ బరమేశ్వరుఁడే యెదురుగా వచ్చినఁ జూచి, యారాజు ముదమందుచు నాతనికి నమస్కరించి తన యింటికి భోజనము సేయుటకు రమ్మని ప్రార్థించెను- తన కిష్టమయిన పదార్థముఁ బెట్టినచో వచ్చెదనని యతీశ్వరుఁడు చెప్పెను. సిరియాళుఁ డందుకు సమ్మతించి యాతని నింటికి దోడ్కొనివచ్చెను - ఇంటికి వచ్చిన పిదప నేమి పదార్థములు గావలయునని సిరియాళుఁడును నాతని భార్యయు నమ్మునిసడిగిరి. "మీ కుమారునిఁ జంపి, యామాంసమును వండి పెట్టుఁ"డని యాతఁడు వారికిఁ

జెప్పెను. ఇప్పుడు సిరియాళుఁ డేమి సేయును? వలసిన దానిం బెట్టెదనని యాతఁ డాయోగీశ్వరునకుఁ జెప్పియుం డెను. ఇప్పుడామాటఁ దప్పినచో సత్యహాని కలుగును గదా? సత్యహాని వలనఁ బాప మొదవును - ఆతని కేమి సేయుటకును దోఁచలేదు - అప్పు డతని కుమారుఁడగు మతిమంతుఁడు పాఠశాలనుండి వచ్చి దుఃఖించుచున్న తల్లి దండ్రులను జూచి, కారణ మడిగెను. మునీశ్వరుని యభీష్ట మును దెలుపలేక తెలుపలేక మతిమంతునకు సిరియాళుఁ డట్టకేలకుఁ దెలిపెను.

మతిమంతుఁడు బాలుఁడైనను ధైర్యముఁబూని తల్లి దండ్రుల కిట్లు చెప్పెను. "మీరు నాకొఱకు దుఃఖింపవలదు. పుట్టిన వారెప్పటికైనఁ జావవలసిన వారే. అందులో ముని కాహారముగా నన్నిచ్చుట మీకుఁ బుణ్యమే. ఇంతకంటెఁ గావలసిన భాగ్యమేమున్నది? ఇఁకమీరు ధైర్యమువహించి నన్ను వధించి యాయతీశ్వరునకు వండిపెట్టుఁడు." ఈమా టలు విని సిరియాళుఁడు కొంత వఱకు దుఃఖించి తుదకు ధైర్య మవలంబించి, మతిమంతుని వధించి, యామాంసమును వండించి, పళ్లెరమునఁ బెట్టి మునిని భుజింపుమనెను. ఆ మునీశ్వరుఁడు రాజుఁజూచి 'నీ కింకను బుత్రులున్నారా?' యని యడిగెను. 'లేరని' యాతఁడు బదులు సెప్పెను.

'అయినట్లయినఁ బుత్రులులేని గృహమున భిక్షఁగొన'నని మునీంద్రుఁడు కోపముతోఁ బలికెను. రాజు బ్రతిమాలుకొనెను. అప్పుడు పరమేశ్వరుఁడు దయగలవాఁడై "రాజా! పుత్రులులేని యింట భిక్షఁగొననని నాకు దీక్షయున్నది. కావున నీపుత్రుని గట్టిగా బిలువుము. ఆతఁడు వచ్చు"నని చెప్పెను. చచ్చిన పుత్రుఁడు పిలిచినయంతమాత్రమున నెట్లువచ్చునని యాశ్చర్యమంది, ముని యానతి ననుసరించి, "మతిమంతా! మతిమంతా"యని గట్టిగాఁ బిలిచెను. వెంటనే మతిమంతుఁడువచ్చి సిరియాళుని యెదుట నిలిచెను. ఇదియంతయు నీశ్వరుని మాయ. అంతటఁ బరమేశ్వరుఁడు సిరియాళునిఁజూచి " రాజా ! నీ సత్యసంధతను బరీక్షించుట కిట్టిపనిఁజేసితిని. నీ గుణమునకు మెచ్చితిని. సత్యము నిలుపుకొనుటకుఁ గన్న కొడుకునుగూడ వధించితివి. వధింపఁబడిన యాకుమారుఁడు నాకరుణచే మరల బ్రదికినాఁడు. ఇఁక నీవు సుఖమున నుండు"మని పలికి మాయమయ్యెను.

భగవంతుని మహామహిమలఁ గనుగొనుట కెవ్వరును శక్తులుగారు. భక్తుల హృదయముల నాతఁ డనేకవిధములఁ బరీక్షించుచుండును.



# 14 రాజ్యవర్ధనుఁడు

"పృథ్విభువు దేవాంశమున సము - ద్భవుఁడుగాన
వానిఁ గొలువఁగ వలయు దై - వంబుపగిది"

పూర్వకాలమున రాజ్యవర్ధనుఁడను నొక రాజుం డెను. ఆతఁడు సత్యసంధుఁడును - ధర్మాత్ముఁడు నైయుండి ప్రజలను దన కన్నబిడ్డలుగాఁ జూచుకొనుచు రాజ్యపరిపాల నము సేయుచుండెను, ప్రజలును నాతనిని దైవముగ భావించి మెలంగుచుండిరి - తమ కెప్పుడును రాజ్యవర్ధ నుఁడే నృపాలుఁడుగ నుండవలయునని, భగవంతుని వారు నిరంతరము గోరుకొనుచుందురు. ఆతఁ డనేకవేల వత్సర ములు రాజ్యపరిపాలనము సేసెను. ఒకనాఁ డాతని భార్య యతనికిఁ దలయంటునప్పుడు తెల్లబడిన యొక శిరోజమును జూచి కన్నీరు బెట్టెను. రాజ్యవర్ధనుఁ డందుకుఁ గారణ మేమని యడుగ నామె "నాథా ! మీతల నెఱయుచుం డుటచేత మీరు ముసలివారగుచున్నారని తెలియుచున్నది దీనివలన మీయాయుష్య తగ్గుచున్నదని వగచుచున్నా" నని వచించెను. ఆమాటలు విని వృద్ధుఁడగుచున్న యారా జింక తపము సేయుట కరణ్యమునకుఁ బోవుట మంచిదని తలంచెను. ఆతఁడు పౌరుల నందఱినిఁ బిలిపించి వారిం జూచి

"పౌరులారా! నేను పెక్కేండ్లీధరణీతలమును బరిపాలించితిని - ఇప్పుడు వృద్ధుఁడ నైతిని. కావున, పూర్వపు రాజుల యాచారము ననుసరించి, యడవికిఁ బోయి తపము సేసికొనుచుఁ గాలము గడపెద" నని పలికెను. ఆమాటలకుఁ బ్రజ లిట్లనిరి-"రాజేంద్రా! మేము నిన్ను విడిచి యుండఁజాలము - మే మెప్పుడును నీవే మాకు రాజుగ నుండవలయునని కోరుకొనుచుందుము - నీవరణ్యమునకుఁ బోవలదు. నీకాయువు హెచ్చుగుటకు మేము ప్రయత్నము సేయుదు" మని పలికి వారందఱును సూర్యునిఁ గూర్చి తపస్సు చేసిరి. సూర్యుఁడు వారితపమునకు మెచ్చి ప్రత్యక్షమై "మీ కేమి కావలయు" నని యడిగెను. అందుకుఁ బ్రజలు సూర్యునకు నమస్కరించి "దేవా! లోకమున నిన్ను మించిన ప్రత్యక్ష దైవము మఱియొకఁడు లేఁడు - మారాజచంద్రుఁడగు రాజ్యవర్ధనుఁడు పది వేల వత్సరములు జీవించునట్లు సేయు" మని విన్నవించిరి - సూర్యుఁడు వారు కోరిన వర మిచ్చెను. ప్రజలు సంతోషించి, యావృత్తాంతము రాజ్యవర్ధనున కెఱింగించిరి. ప్రజలకుఁ దనపైనున్న భక్తికిని - ప్రేమకును నపరిమితానందముఁ బొంది, యతఁడు పెక్కేండ్లు రాజ్యము బాలించెను. ప్రజలకు ముదంబు గూర్చెను.

# 15 ఒక బ్రాహ్మణుఁడు

‘ ఋణము నెగవేయరాదు ,’

ఒక గ్రామమున నొక బ్రాహ్మణుండెను. ఆతనికొక శిశువుజనించి, వెంటనే మరణించెను. అందుకై తల్లియేడ్చుచుండఁగా బ్రాహ్మణుఁడా శిశువుఁగాంచి "నీవు పుట్టక పోయిన మాకీ యేడుపుండదు కదా?" యనియనెను. అప్పుడాబిడ్డ "అయ్యా! నేను పూర్వజన్మమున కూలిఁ జేసికొని బ్రదుకువాఁడను. నా చేత మీరు పనిసేయించుకొని యా డబ్బు నొసఁగ లేదు. అది తీసికొనుటకిటు పుట్టితిని. తీసికొనిపోవుచుంటి"నని పలికెను. ఇట్లే యా బ్రాహ్మణునకుఁ గ్రమముగా ముగ్గురు పుత్రులుపుట్టి చచ్చిరి. తరువాత నాల్గవ పిల్లవాఁడొకఁడు పుట్టెను. తండ్రి ఆ బిడ్డనుజూచి "నీవు గూడ మాకు దుఃఖము గలిగించుటకే పుట్టితివా" యనెను. ఆ బిడ్డ "నేను పూర్వజన్మములో నాముదపు వర్తకము జేసికొనుచుండువాఁడను. మీరు నాదగ్గఱ నొక మణుగు ఆముదము తీసికొని, వెల నీయకపోతిరి. ఆ మణుగు ఆముదము మీ యొద్దఁ దీసికొనిపోవుదు" నని చెప్పెను. అప్పుడు బ్రాహ్మణుఁడు ఒక మణుగు ఆముదముఁ గుండలోఁ బోసి తెచ్చి భార్యంజూచి "ఓసీ! ఈ ఆముదమయి

పోప్రవటకు వీఁడు మనబిడ్డఁడు" అని చెప్పెను. ఆమె యా యాముదము బాలున కుపయోగించుచుండెను. కుండలోఁ గొంచెము యాముదము నిలువయుండఁగా బిడ్డకు రోగము ప్రారంభించి క్రమక్రమముగా హెచ్చెను. ఒకనాఁడాబిడ్డడు బ్రదుకఁడని నాకిటఁబడవేసి తల్లియేడ్చుచుండెను. ప్రాణము మాత్రము పోవక బిడ్డ యాయాసమందుచుండెను. అప్పుడా యిల్లాలు భర్తంజూచి "ఈ బిడ్డఁడు పడుచున్న బాధఁ జూడఁ జాలకయున్నాను. మఱుగు ఆముదము అయిపోప్రవటకు నుండునని చెప్పితిరే? ఆముదమయిపోయినది. ఇంకను మరణబాధ నొందుచున్నాఁడేమి?" యనెను. "ఆముదపుకుండ బాగుగఁ దుడిచి చూడుము. కొంచెము మురుకును. ఉన్నది కొంచెము వానికిఁ బూయు"మని బ్రాహ్మణుఁడు బదులు చెప్పెను. ఆమె యట్లు చేసెను. వెంటనే పిల్లవాఁడు ప్రాణములు విడిచెను. అనంతరము బ్రాహ్మణునకు మరల నొక కొడుకుపుట్టెను. ఆబిడ్డనుగూడ బ్రాహ్మణుఁడు "నాయనా! నీవుగూడ ఋణముదీర్చుకొనుటకే పుట్టితివా?" యనియడిగెను. ఆబిడ్డఁడు తండ్రినిజూచి "అవును. నేనుమీకు మూడుఁ వేలరూపాయ లియ్యవలసి యున్నాను. ఆసొమ్ము నిచ్చుటకుఁ బుట్టితి"నని చెప్పెను. అప్పుడు బ్రాహ్మణుఁడు భార్యంజూచి "ఓసీ! నేను చెప్పినట్లు చేసితివేని వీఁడు మనకుఁ దక్కును. వీని నతి జాగ్రత్తతోఁ బెంచుము. వీని చేతనుండి నీవొక

తమలపాకయినఁ దీసికొనవలదు"అని పలికెను. అందుకు భార్య సమ్మతించి పిల్లవాని నతి జాగ్రత్తగాఁ బెంచెను. పిల్లవాఁడు పెఱిగి, పెద్దవాఁడై విద్యనేర్చుకొని స్వయముగా ధనము సంపాదించుచుండెను. ఆతఁడెంత ధనము సంపాదించుచుండినను దల్లిదండ్రులు మాత్ర మతని యొద్దనుండి యొక గవ్వనైనఁ బుచ్చుకొనకయుండిరి. ఇట్లుకొన్ని సంవత్సరములు గడచెను. ఇట్లుండ నొకనా డాతఁడేదో గ్రామమునకుఁ బోవఁదలఁచి దుస్తుల ధరించి యొక చిన్నమూటఁ బట్టుకొని, వాకిటఁ దనకై గుఱ్ఱపువాఁడు తెచ్చి నిలువఁబెట్టిన గుఱ్ఱము నెక్కఁ బోయెను. పిల్లవాఁడు ఇంతవాఁడై గుఱ్ఱము నెక్కుచుండెనని తల్లి సంతోషముతో వాకిటనిలిచి చూచుచుండెను. గుఱ్ఱము పెంకెతనముచే నాతని నెక్కనీయక నిటునటు గదలుచుండెను. అప్పు డాతఁడు గుఱ్ఱము నెక్కిన తరువాత మూట నందుకొనవచ్చునని తలంచి, తల్లిని బిలిచి "అమ్మా! ఒక్కసారి యీ మూటఁ బట్టుకొను'' మనెను. తల్లి ఆ మూటఁ బట్టుకొనెను. ఆతఁడు గుఱ్ఱమెక్కెను. వెంటనే గుఱ్ఱము పరుగెత్తి యాతనిని దల క్రిందుగాఁ బడవేసెను. ఆతఁడు నేలఁబడి ప్రాణములు విడిచెను. అది చూచి తల్లి పెద్దపెట్టున నేడ్చుచుండెను. అప్పుడు బ్రాహ్మణుఁడు వచ్చి భార్యవలన సంగతిఁ దెలిసికొని, మూటవిప్పి చూచెను. అందు మూఁడువేల రూపాయ లుండెను.

భార్యకు భర్త "పిల్లవాఁడు పుట్టినప్పుడు చెప్పినట్లు చేసి పోయె"నని పలికి యోదార్చెను.



# 17 రావణుఁడు

'ఆ. పరగఁజాతిగుండు పగులఁగొట్టఁగ వచ్చుఁ
గొండలన్ని పిండి గొట్టవచ్చుఁ
గఠినచిత్తు మనసు కరగింపఁగారాదు
విశ్వదాభిరామ వినరవేమ!'

పూర్వము లంకాపురమును రావణుఁ డను దైత్యేంద్రుఁడు పరిపాలించు చుండెను. వానిభార్యపేరు మండోదరి. ఆతఁడు బ్రహ్మఁగూర్చి తపమొనర్చి యనేకమయిన వరములఁ గాంచి, లోకకంటకుండై యొప్పుచుండెను - బ్రహ్మయిచ్చిన వరములచే నాతఁడు గర్వించి దేవతలను - మునులను బాధించుచుండెను. బృందారకులందఱును లోకవిద్రావణుఁ డగు రావణుఁ డెప్పుడు చచ్చునాయని వేయిదేవుళ్ల కనిశము మ్రొక్కుచుండిరి.

ఇట్లుండఁ శ్రీరాముఁడు తండ్రి యాజ్ఞను బరిపాలింప భార్యతోడను - దమ్మునితోడను బయలుదేరి దండకారణ్య

మునఁ బర్ణశాలలో వసించుచుండెనని విని రావణుఁడచ్చటికిఁ బోయి రామలక్ష్మణులను మోసపుచ్చి సీతను దొంగిలించి కొనిపోయెను. ఇట్టి యకార్యము వలదని యాతనికిఁ గొందఱు చెప్పిరి. కాని వినక యాతఁడాపని చేసెను. అంతఁ గొన్నాళ్ళకు రాముఁడు సీత జాడల నెఱింగి, వానరబలసహాయమున సముద్రమును దాటి లంకపై దండెత్తి వచ్చెను. రావణునకును రామునకును మిక్కుల భయంకరమయిన యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో రాముఁడు రావణుని పుత్రులను - దమ్ములను - బంధువులను - మంత్రులను వధించెను. రావణుఁడొక్కఁడే మిగిలి యుండెను. ఆతఁడు తనకు సంభవించిన దుర్గతికి విచారించుచు, రాముని నెట్లు గెలువఁ గలుగుదునా యని యాలోచింప సాగెను. ఆసమయమున నాతని భార్య నెమ్మదిగా నాతనిం జేరి యిట్లు పలికెను "దైత్యేశ్వరా! నీవు మహా బలపరాక్రమ శాలివి. బ్రహ్మచేత ననేక వరములఁ గాంచినవాఁడవు. సకల ధర్మములు తెలిసిన వాఁడవయ్యును, ధర్మసంధుఁడైన రాముని భార్యను దొంగిలించి కొనివచ్చితివి. పరుల కాంతను దెచ్చుట మహా పాపము. సీతను నీవు తెచ్చుట చేతనే యిట్టి యుద్ధమయినది. నీ కుమారులు మొదలగు వారందఱును రామునిచేఁ గూలిరి. రాముఁడు సామాన్యుఁడు

గాఁడు. ఆతఁ డాదినారాయణమూర్తి. సీతయే లక్ష్మి. నీవు రాముని గెలువఁజాలవు. అదియుఁగాక నీవు బ్రహ్మచే వరములు వడయునప్పుడు నరవానరులచేఁ జావులేకుండ వరము నంద లేదు. కావున నిప్పుడయిన నీవు నామాటలు విని సీతను రామున కిచ్చి శరణు బొందుము. ఆతఁడు నిన్నుఁ దప్పక రక్షించును. ఇప్పుడైన నీవు నామాటల వింటివేని యీయున్నవారితో సుఖముల నందఁగలవు. క్రోధమును-బౌరుషమును వదలుము. శాంతమును బూనుము. మంచి చెడ్డలు విచారింపుము."

మండోదరి యీ విధముగాఁ జెప్పి, రావణుని చిత్తము యుద్ధమునుండి మరల్చుట కెంతయో ప్రయత్నించెను. ఆతఁడు చచ్చుటకైన నొప్పుకొనెను గాని రాముని శరణుఁ బొందుటకు మాత్రము సమ్మతింప లేదు. తుదకు మండోదరి ప్రాణములు విసిగి, కఠినచిత్తుని మనస్సుఁ గఱిగించుట కష్టమని తలంచి మిన్నకుండెను. తరువాత రావణుఁడు యుద్ధములో రామునిచేఁ గూలెను.

# 17 రంతిదేవుఁడు

"దానమే భూషణంబు హ - స్తమున కరయ
మానసీయుఁడు పుణ్యుండు - దానపరుఁడు"

పూర్వము రంతిదేవుఁడను నొక రాజు గలఁడు. ఆతఁడు బాల్యమునుండియు శ్రీహరికి భక్తుఁడై యుండెను. ఈతఁడు రాజుగా నున్నప్పుడు, తనయొద్దకు వచ్చిన వారి కోరికలు దీర్చి ముదమందు చుండెడివాఁడు- బ్రాహ్మణపూజ - హరి భక్తి - మునిసేవ- ధర్మవర్తనము - సత్యము - ఆతనికిఁ బెట్టని భూషణములై యుండెను. ఆతని రాజ్యపాలనమును బొగడని మానవుఁడే లేఁడు.

కొన్నాళ్ళ కాతఁడు తనరాజ్యసంపదలన్నియు నర్థుల కిచ్చివేసి, యరణ్యములకుఁ బోయి హరిని సేవించుచుండెను. ఈతని కొక సమయమున వరుసగా నలుబది దినములవఱకు నన్నము లభింపక కడపటి దినమున నొక్కచోట పంచ భక్ష్య పరమాన్న యుతమయిన భోజనము లభించెను. దానిం గాంచి రంతిదేవుఁడు పెన్నిధిఁగన్న పేదచందమున నానంద మందుచుఁ దినుటకు సంసిద్ధుఁడై యుండెను. ఆ సమయమున నాతని కడ కొక భూసురుఁ డతిథియై వచ్చెను. రంతిదేవున కొక్కింతయుఁ జింత కలుగలేదు. బ్రాహ్మణపూజ సమస్త పాపహరంబని తలంచి, తాను

భుజింపఁ దలంచిన యన్నములో సగభాగ మాతనికిచ్చెను. బ్రాహ్మణుఁడు సంతృప్తిఁ బొంది యరిగెను - మిగిలిన యన్నము నారంతిదేవుఁడు దినఁబోవుచుండ నొక శూద్రుఁడు వచ్చి యాచించెను. అంతట నున్నదానిలో సగపాలాశూద్రునకిడిన, వాఁడును భుజించి చనెను - తరువాత మఱియొకఁడు దేర, శేషించిన యన్న మాతనికిఁ బెట్టెను. ఇంక రంతిదేవునకుఁ దినుట కన్నము లేదు - ఆతనియొద్ద తియ్యని జలములు మాత్ర మున్నవి. ఆతఁడు వానినైనఁ ద్రావి కడుపు నింపుకొందమని తలంచుచుండ, నొక ఛండాలుఁడు వచ్చి, "జలార్థినై వచ్చితి" నని పలికెను. రంతిదేవుఁడు వానిం జూచి, "అన్నము మాత్రము లేదు. మధురములయిన జలము లున్నవి - తనకు లేకపోవుఁ గాక- ఉన్నంత వఱకు నర్థుల కొసంగినవాని జన్మమే జన్మము - అట్లు చేసినవారిని భగవంతుఁడు రక్షించు'' నని పలికి, తన యొద్ద నున్న జలము నాఛండాలునకుఁ బోసెను. అప్పుడు బ్రహ్మాదు లాతని ధర్మసంధతకు మెచ్చి శుభంబులం గూర్పఁదలఁచి నిజరూపములతోఁ బ్రసన్నులై "రంతిదేవా! నీయౌదార్యమునకు మేము సంతసించితిమి. నీగుణముఁ బరీక్షించుటకు మేమే యిట్టి రూపములఁ దాల్చి యన్నపానీయము లర్థింప వచ్చితిమి - హరిభక్తుఁడవగు నీకు సర్వ

శుభఁము లొదవుఁగాక'' యని పలికి కోరినవరము లిచ్చి చనిరి. రంతిదేవుఁడు హరిభక్తి తత్పరుఁడై యుండి కొన్నాళ్ళకు దివ్యపదము నందెను.



# 18 దుర్వాసుఁడు

"తపము పెంపున గర్వించి - తపసియేని
భక్తులకు నెగ్గొనర్చిన - భంగపడును''

మున్ను అంబరీషుఁడను రాజేంద్రుఁ డొకఁడు భూతలమును నిరంకుశముగఁ బరిపాలించుచుండెను. ఆతని ధర్మవర్తనము, సత్యసంధత, భక్తి, బలపరాక్రమములు వర్ణించుటకు శేషునికైనఁ దరముగాదు - ఆతఁడు హరిభక్తుఁడగుట చేత హరిప్రీతికై సరస్వతీ నదీతీరమున ననేక యాగములు చేసెను. హరిభక్తి యాతనికి వృద్ధియైనకొలఁది రాజ్యభోగములయం దిచ్ఛ తగ్గసాగెను - శ్రీహరి యాతని నిశ్చల భక్తికి సంతసించి, శత్రువుల శిక్షించునట్టిదియు, సజ్జనుల రక్షించునట్టిదియు, నగు తన చక్రాయుధమును అతనికిఁ బ్రసాదించెను.

ఇట్లుండ నొకనాఁ డాతఁడు ద్వాదశీవ్రతముఁ జేసి, భూసురులకుఁ బెక్కు దానములు గావించి పారణ సేయుటకు సంసిద్ధుఁడై యుండెను. ఆసమయమున దుర్వాస మునీంద్రుఁ డక్కడకు వచ్చెను. అంబరీషుఁ డామునీంద్రునిఁ బూజించి తన యింట భుజింపుమని కోరెను. మునీంద్రుం డందుకు సమ్మతించి స్నానార్థము నది కరిగెను. ఎంతసేపు కనిపెట్టుకొని యున్నను మునీంద్రుఁడు స్నానముచేసి రాఁడయ్యెను. ఇంక ముహూర్త మతిక్రమించినచో ద్వాదశి దాటును - అంబరీషుఁడు శాస్త్రజ్ఞులను భూసురులను నేమి సేయుదమని యడిగెను. బ్రాహ్మణులు రాజుం జూచి "రాజేంద్రా! స్నానమున కరిగిన యతిథి వచ్చుటకు జాగగుచున్నది, అందుకై పారణము నాపరాదు. అతిథి రాకుండఁ గుడువను రాదు. కావున నీళ్లు త్రాగుట యిప్పటికిఁ దగిన పని" యని చెప్పిరి. బ్రాహ్మణహితము ననుసరించి యంబరీషుఁడు శ్రీహరిం దలంచి జలపారణ సేసి దుర్వాసునికై వేచియుండెను.

తరువాత దుర్వాసుఁడువచ్చి రాజు జలపారణసేయుటఁ గాంచి, పండ్లు పటపటఁ గొఱకుచు నచ్చటి వారెల్ల వినుచుండ "మీరందఱును జూచితిరికదా ? ఈతఁడు నన్నుఁ దనయింటి కతిథిగాఁ బిలిచి, నేను రాకుండఁగనే పారణసేసి

నాఁడు. ఈతనిని సైరింపరాదు. నా కోపము నెవ్వఁడు వారింపఁగలఁడో చూచెదఁగాక" యని పలికి భయంకరా కారుఁడై సమంత్రపూర్వకముగా జటను విడువ, నయ్యది కృత్తిరూపమును బొంది, యగ్నిజ్వాలలఁ గ్రక్కుచు రాజేం ద్రునిఁ జేరవచ్చుచుండెను. కోపస్వభావుఁడయిన ముని దుష్కృత్యమును శ్రీహరి యెఱింగి కృత్తిని వారింపఁ దన చక్రమును బంపెను. ఆచక్రము కృత్తిని వారించి, యంతఁ బోవక దుర్వాసుని వెంట నంటెను. దుర్వాసుఁడు చక్రా నలజ్వాలలకుఁ దాళఁజాలక పరుగులెత్తుచుండెను. అదియు నాతని వెన్నంటెను. మునీంద్రుఁడు భయమందుచు బ్రహ్మను జేరి రక్షింపుమని వేడుకొనెను. అందుకు బ్రహ్మ "ఓయీ! శ్రీహరిచేఁ బ్రయోగింపఁబడిన యీచక్రాగ్ని నెవ్వఁ డార్పఁగలఁడు? నేనును శంకరుఁడును - నాతని యాజ్ఞననుస రించి వర్తింతుము. కావున నీవాతనినే శరణుఁ బొందు" మని పలికెను.

దుర్వాసుఁడు పరుగుపరుగున శ్రీహరి సన్నిధికిఁ బోయి "మహాత్మా! నాయపరాధమును మన్నించి రక్షిం పుము. నీదాసున కెగ్గొసలిపితి" నని ప్రార్థించెను. అందుకు శ్రీహరి "దుర్వాసుఁడా! నాభక్తుల కెగ్గుసేసినవాఁడు నా కెగ్గుసేసినవాఁడే యగును. నేనునిరంతరము నాభక్తుల కెట్టి సంకటములు గలుగకుండఁ గాపాడుచుందును. ఇప్పట్టున నీవు

అంబరీషునే శరణుఁబొందుము. ఆతఁడే నిన్ను రక్షించువాఁ" డని పలికెను. ఆహా! భగవంతునకు భక్తుల యందెంత ప్రేమయున్నది? అంతట దుర్వాసుఁ డతిరయమున నంబరీషుంజేరి "నృపాలా! నీమహిమ నెఱుంగక తప్పుచేసితిని. చక్రాగ్నిఁజల్లార్చి నన్నుఁగాపాడు" మని ప్రార్థించెను. అప్పు డంబరీషుఁడు హరిం దలంచి చక్రమును శాంతింపుమని ప్రార్థించెను. చక్రము శాంతించెను. దుర్వాసుఁడు భయరహితుఁడై యంబరీషునిఁ బెక్కువిధములఁబొగడి దీవించిచనెను.

# 19 అక్రూరుఁడు.

అక్రూరుఁడు యాదవ కులమున జన్మించెను. ఈతఁడు బాల్యమునుండియు సద్గుణములు గలవాఁడై భక్తుఁడై యుండెను. ఈతఁడు మధురాపురములో లోకకంటకుఁడైన కంసుని సేవించుచుండెనను మాటయేగాని యాతఁడెప్పుడు నధర్మమార్గమున నడువలేదు. సత్యము, ధర్మము, పెద్దల సేవ, యాతని కుగ్గుపాలతోఁ బట్టువడినవి. కంసుని సేవయందితఁడు సత్కార్యములు సేయుటయందె నియోగింపఁ బడుచుండెను. భక్తులలో నీతఁడుత్తముఁడని చెప్పఁబడెను.

గోపకులమునఁ బుట్టిన బలరామ కృష్ణులవలనఁ దనకు హాని గలుగునని తలఁచి ధనుర్యాగముఁ జూచుటయను నెపమున రామకృష్ణులను మధురకుఁ దోడితెమ్మని కంసుఁ డక్రూరుని నియమించెను. ఇదిరాజాజ్ఞ. రాజునకు వ్యతిరేకముగా నక్రూరుఁడు ప్రవర్తింపఁడు. అప్పుడతఁడు కంసునిఁజూచి "మహారాజా! నీపంపు నేను సేయకుందునా? దైవయోగ మెట్లున్నదో యెవ్వరికిని దెలియదు. నీయానతి ననుసరించి రామకృష్ణులఁ దోడ్కొనివచ్చెద"నని పలికి రథమెక్కి బృందావనమునకు బయలుదేరెను. కంసుఁడు రామకృష్ణులను రావించుట యెందులకో అక్రూరునకుఁ దెలియును. భగవత్స్వరూపులయిన యామహానుభావులను జూడఁగలుగుదు నను సంతో

షమునుగూడ నాతఁడు పొందుచుండెను. ఆతఁడు తన మన ములో "నేను పూర్వజన్మమున నెట్టి తపముచేసితినో! ఎట్టి దానము లాచరించియుంటినో? మునీంద్రులకయినను దర్శనం బొసంగని యాదిదేవుండగు శ్రీకృష్ణునిఁ జూచుటకు అవివేకి నగు నేనేగుచుంటిని? జ్ఞానులయినవారు ఏమహానుభావుని నాశ్రయించి భవసాగరమును గడచుచుందురో? యట్టి శ్రీహరిని వైరముచేతనయినఁ బిలుచుటకు నియోగించి యీ కంసుఁడు నాయెడలఁ బుణ్యముఁ గట్టుకొనినాఁడు. ఆహా! కంసునివంటి యాప్తుఁడు మఱియొకఁడు లేడు. కాని యొక్క విషయమున మాత్రము నాకు సంశయమగుచున్నది. నేను గంసునివలనఁ బంపఁబడితినని యెఱింగి శ్రీకృష్ణుఁ డాదరిం చునో లేదో? ఇంతకును నాభాగ్యమెట్లున్నదో?' యని తలంచుకొనుచు బృందావనమును సమీపించెను. గోపాల కుల కేకలు గోవుల యంభారవములు విని ముదమందుచుఁ గడువడిగా రథము నడిపించుకొని గోకులముఁ బ్రవేశించి రామ కృష్ణుల మందిరమున కరిగి రథముడిగ్గి లోపలఁ బ్రవే శించెను.

ఆసమయమున బలరామ కృష్ణు లిరువురును మంది రమునందే యుండిరి. అక్రూరుఁడు వారింగాంచి భక్తిపూర్వ కముగ నమస్కరించెను. శ్రీకృష్ణుఁడాతనిఁ బ్రేమమీరఁ గాగి

లించుకొని బహువిధముల గౌరవించెను. భోజనానంతరమున నందాదులు వినుచుండ నక్రూరుఁడచ్చటికిఁ దాను వచ్చుటకుఁ గారణ మెఱింగించెను. అంతటఁ గృష్ణుఁడు గోపకులఁజూచి "నాకుఁ గంసుఁడు ధనుర్యాగ మహోత్సవముఁ జూడరమ్మని వార్తఁ బంపినాఁడు. కావున మీరందఱును గంసునకుఁ గానుకగా నొసంగుటకుఁ బెఱుగు పాలు నెయ్యి మొదలగు నవి సిద్ధపఱచి ప్రయాణమునకు సంసిద్ధులై యుండుఁడు" అని చెప్పెను. శ్రీకృష్ణుని యాజ్ఞకు బద్ధులై వారందఱును సర్వము సిద్ధము సేసికొని ప్రయాణమయిరి. అనంతరము కృష్ణుఁడు బలరామ సహితుఁడై యక్రూరుని రథమెక్కి మధురాపురము నకు బయలుదేరెను. మార్గమధ్యమునఁ గాళిందీతీరమున రథమునిలిపి రామకృష్ణులు దాహము దీర్చుకొనివచ్చి రథ స్థులై యుండిరి. అప్పుడక్రూరుఁడుగూడ దాహము తీర్చు కొనుటకు జలములందు దిగెను. అతఁడు నీరు ద్రావుచుం డఁగా నీటియం దాతనికి బలరామకృష్ణులు గనిపించిరి. రథము పైఁగూడ వారుండిరి. అక్రూరుఁడు వారి మహిమ కద్భుత మంది వారి ననేకవిధముల నుతించి రథమెక్కెను. కృష్ణుఁడు మధురను బ్రవేశించి కంసుని సంహరించెను. నాటినుండి యక్రూరుఁడు శ్రీకృష్ణుని సేవించుచుండెను.

సత్రాజిత్తు తన పుత్రికయగు సత్యభామను దనకీయక కృష్ణున కొసంగెనని శతధన్వుఁడను వాఁడెట్లే

యిన సత్రాజిత్తున కెగ్గుసేయఁ దగిన కాలమునకై వేచియుండెను. ఇట్లుండ నొక సమయమున బలరామకృష్ణులు పాండవులు లక్కయింట దగ్ధులయిరని విని హస్తినాపురమున కేగిరి. ఆ సమయమున శతధన్వుఁడు సత్రాజిత్తును జంపి, యతని యొద్దనున్న మణి నపహరించి, కృతవర్మ యను వానికడ కరిగి, హరితోఁ గయ్యమొనర్చుటకు రమ్మని యడిగెను. కృతవర్మ నిరాకరించెను తరువాత శతధన్వుఁ డక్రూరునిఁ జేరి కృతవర్మ నడిగినట్లె యడిగెను. అందుల కక్రూరుఁడు "ఓయీ! నీ వెంత వెఱ్ఱివాఁడవైతివి ? కృష్ణుఁడు సామాన్య మానవుఁడని తలంచితివి కాబోలు? ప్రపంచము పుట్టుటకును గిట్టుటకును, నాతఁడే కారణుఁడు. శ్రీమహావిష్ణువే భూభారము వాపుటకు యాదవ కులమున నిట్లవతరించినాఁడు. అట్టి మహనీయునకు నేను నిరంతరము మ్రొక్కుదు''నని చెప్పెను. శతధన్వుఁడు చేయునది లేక సత్రాజిత్తును జంపి తానుగైకొన్న మణి నక్రూరునియొద్ద దాచి, శతయోజనంబుల దూరము పాఱిపోయెను. సత్యభామ హస్తినాపురమున కరిగి, తన తండ్రి మరణమును గూర్చి కృష్ణున కెఱింగించెను. కృష్ణుఁడు శతధన్వ నరయుచుఁబోయి, యొక్కయెడఁ బట్టుకొని, చక్రమున వాని శిరముఁ దునిమెను. కాని మణి మాత్రము వానియొద్ద లేదయ్యెను. అక్రూరుఁడు శతధన్వుని మరణము విని

భయమంది యెటకేనియుఁ బాఱిపోయెను. అక్రూరుఁడు ద్వారకను విడిచిన నాటినుండియు, వానలు లేక, పంటలు పండక క్షామము సంభవించెను. కృష్ణుఁ డిది చూచి పెద్దలతో నాలోచింప వారును గృష్ణునిఁ జూచి "మున్ను కాశీపురమున క్షామము సంభవించెను. అప్పుడు కాశీనాథుఁడు శ్వఫల్కునిఁ గొనిపోయి, యాతనికిఁ దన కుమారి నొసంగి, వివాహముఁ గావించెను. శ్వఫల్కుఁడు కాశియందడుగుపెట్టిన యంతనే వానలుగురిసి రాష్ట్రమున బంటలు వృద్ధిఁబొందెను. అతని కుమారుఁడే మన యక్రూరుఁడు. ఇతఁడును దండ్రి యంతటివాఁడు. కావున నాతనిని రావింపు" మని పలికిరి. కృష్ణుఁడు చారులను బంపి, అక్రూరుని రావించి, యనేకవిధములఁ బూజించి, నెమ్మదిగా నిట్లు పలికెను. "అక్రూరా! శతధన్వుఁడు నీయొద్ద మణినిదాచిన సంగతి నేను దెలిసికొంటిని. దానిని నేను హరించితినని మాయన్న యనుమానించు చున్నాఁడు. కావున మాయన్న సందేహముఁ దీర్చుటకుఁగాను దానిం దెచ్చి చూపుము." అని పలికెను. అప్పు డక్రూరుఁడు దనయొద్దనున్న మణిని శ్రీహరికి సమర్పించెను. అక్రూరుఁడు ద్వారకలో నడుగు బెట్టఁగనే వర్షములు గురిసినవి. క్షామ భాధలడఁగినవి.

అక్రూరునకు శ్రీకృష్ణుని యందున్న భక్తి వర్ణింపఁ దరముగాదు. ఆతడు తనజీవితకాలమంతయుఁ గృష్ణుని సేవ

యందే ముగించి యామహాత్ముని యను గ్రహమున జ్ఞాన మును బడసి ముక్తుఁడయ్యెను.



## 20 ఆరుణి

ధౌమ్యుఁడను ఋషీశ్వరునకు ఆరుణియను పేరుగల శిష్యుఁ డొకఁడుండెను. ఆతఁడు సదాచారనిరతుఁడు. ప్రతి దినము నిద్రమేల్కొనిన వెంటనే ప్రాతఃకాల కృత్యముల నిర్వర్తించి, సంధ్యావందనముఁ జేసికొని వేదపఠనము సేయువాఁడు. ఆతఁడు నిరంతరము గురుని యానతి శిర మునఁ దాల్చి వర్తించుచుండెను. ఆకారణమున ధౌమ్యుఁడు శిష్యులందఱికంటె నాతనియెడ మిక్కిలిఁ బ్రేమగలిగియుండెను.

ఇట్లుండఁ జలికాలము వచ్చెను. ఆకాలమున సూర్యా స్తమయ మయిన పిదప నెచ్చటికిఁ బోవుటకును శిష్యులకు మిగుల కష్టముగా నుండెను. ఒకనాఁడు ధౌమ్యుఁడు తన ప్రియశిష్యుఁడైన యారుణిం జూచి "మన పొలమునకు గట్టు తెగి నీరు వెలుపలికిఁ బోవుచున్నదఁట. నీవరిగి నీరుపోకుండఁ జేసిరమ్ము" అని చెప్పెను. గురుని యానతి ననుసరించి యారుణి పొలమున కరిగి తెగిన గట్టుం జూచి యచ్చటఁ

గొంత మన్ను వేసెను. అట్లు చేసినను నీరు నిలువలేదు. నీరు నిలచువిధము సేయుమని యాతనికి గురుఁ డాజ్ఞయిచ్చి నాఁడు. అందులకై యాతఁడే యాగట్టు దెగిన ప్రదేశమున కడ్డముగాఁ బండుకొనెను.

ఎంత ప్రొద్దుపోయినను శిష్యుఁడు గృహమునకు రాక పోవుటచేత, ధౌమ్యుఁ డాతనిని వెదకుచుఁ బొలము కడకు వచ్చి "ఆరుణీ! ఆరుణీ!" యని పెద్ద యెలుంగునఁ బిలిచెను. ఆతఁడు పలికెను. గురుఁడు శిష్యుని సమీపించి, యాతఁడు చేసిన కార్యమును జూచి, యాతనికిఁ దనయందుఁ గల భక్తికి మిగుల సంతసించి గృహమునకుఁ దోడ్కొని పోయెను. ధౌమ్యుఁ డాతనికి సమస్త విద్యలును జదువకయే యబ్బునట్లు వర మనుగ్రహించెను. ఆరుణి ఋషీశ్వరులలోఁ బ్రముఖుఁ డయ్యెను. కావున గురుని దైవముగఁ బూజించు వాఁడు సర్వశుభములఁ బొంది కీర్తిఁగాంచును.

# 21 విక్రమార్కుఁడు

పూర్వము పరకాయ ప్రవేశమను నొక గొప్ప విద్య గలదు. జీవుఁ డొక శరీరమును వదలి మఱియొక శరీరమును బ్రవేశింపఁ గలుగుటయే యీ విద్యాప్రభావము. ఈమహా విద్య సాధారణముగా నెవ్వరికిని దెలియదు. కాని ఉజ్జయినీ పురమేలు విక్రమార్క మహారాజునకు మాత్రము తెలి యును. ఒక సమయమున నాతఁడు తన శరీరమును విడిచి యొక చిలుక శరీరములోఁ బ్రవేశించెను. ఈవిద్య నెఱిఁగిన శంబరుఁడను వాఁడొకఁ డిదియంతయుఁ దెలిసికొని తాను విక్రమార్కుని శరీరమునఁ బ్రవేశించి, తిరిగి రాజు రాకుండఁ దన శరీరమును గాల్చివేసి, ఉజ్జయినికిఁ బోయి రాజ్య పరి పాలనము సేయుచుండెను. చిలుక శరీరమును జొచ్చిన విక్రమార్కుఁడు తన శరీరము లేకుండుటఁ గాంచి, తానా చిలుక శరీరమందే యుండి యొకనాఁడు బోయవాఁడు పన్నిన వలలోఁ దగుల్కొని, వానింగాంచి యిట్లు సెప్పెను. "ఓయీ! నీవు నన్నుఁ జంపినందువలనఁ బ్రయోజనము లేదు. నన్నెవ్వనికైన విక్రయించితివేని నీకుఁ గొంత ధనము వచ్చును." అని చెప్పిన విని యా బోయవాఁ డాచి లుక నొక వర్తకుని యొద్దకుఁ దీసికొని పోయెను. ఆవర్త కుఁడు చిలుక పలికెడి పలుకుల కానందించి బోయవానికిఁ

గొంత ద్రవ్యమిచ్చి దానిం గొనెను. ఆవర్తకునకు సంతానము లేదు. ఆచిలుకను గన్నబిడ్డవలెఁ జూచుకొనుచుఁ దన యంగడియందే దాని నొక చక్కని పంజరములోఁ బెట్టి పెంచుచుండెను.

ఆనగరమేలు రాజునకుఁ బద్మావతి యను నొక వేశ్య గలదు. రాత్రులయం దది తన కలలోనికి వచ్చిన పురుషునియొద్ద నూఱు వరాలఁ గైకొనుచుండును. ఇట్లుండ నొకనాటి రాత్రి దానికలలో నొక బీదబ్రాహ్మణుఁడు కనిపించెను. ఆమఱునాఁ డాబ్రాహ్మణుని ఆవేశ్య పట్టించి తెప్పించుచుండఁగాఁ జిలుక చూచి, "ఓ బ్రాహ్మణుఁడా! నీవు విచారింపవలదు. ఆవేశ్యకా వేయివరహాలను నేనిచ్చెదను. ఇచ్చుటికి రావలసినదని దానికిఁ జెప్పు" మని చెప్పెను. ఇంతలో నాచిలుక యొక స్తంభమును బాతించి దాని చివర వరాలమూటఁ గట్టించి యెదుటిభాగమున నొక యద్దమును గట్టించెను. అంతట వేశ్య వచ్చి వరహాల నిమ్మని యడిగెను. అద్దములోఁ గనుపించుచున్న మూటను దీసికొమ్మని చిలుక చెప్పెను. అది యెట్లు సాధ్యమగునని వేశ్య యడుగఁగాఁ గలలోఁ గన్నవానియొద్ద ధనమెట్లు తీసికొందువని చిలుక ప్రశ్నించెను. పద్మావతి సిగ్గుపడి వెడలిపోయెను. కాని, యాచిలుకను జంపింపవలయునని దీక్ష వహించెను.

తరువాత నావేశ్య రాజుతోఁ జెప్పి, యాచిలుకను దెప్పించి కొని దానింజంపి, కూరవండి తెమ్మని వంటకత్తెకుఁ జెప్పెను. వంటకత్తె దానిని వంటయింటనుంచి కత్తిపీటఁ దెచ్చుటకు లోనికిఁ బోయిన యంతనే యాచిలుక రివ్వన నెగిరిపోయెను. వేశ్యకీసంగతి తెలిసినచోఁ గోపించునని తలంచి యావంటకత్తె, మఱియొకపిట్టను దేనినో చంపి, కూరవండి పెట్టెను. వేశ్యయుఁ జిలుక చచ్చినదని సంత సించెను. తప్పించుకొనిపోయిన చిలుక యందందుఁ దిరు గుచుఁ దుదకొక శివాలయమును బ్రవేశించి యందొక చోట రహస్యముగా దాగియుండెను.

ఇట్లుండ నొకనాఁడు పద్మావతి శివాలయమునకుఁ బోయి దేవునిఁ బ్రార్థించెను. ఆ విగ్రహము వెనుకనున్న చిలుక "పద్మావతీ! నీభక్తికి మిగుల సంతసించితిని. ఏమి కావలయునో చెప్పు?" మని యడిగెను. "నాకు బొందితో స్వర్గము గావలయు'నని పద్మావతి కోరెను. అప్పు డాశు కము "ఓ పద్మావతీ! నీవు సంపాదించిన ధనమంతయు, దానముసేసి, తల నున్నగా గొఱిగించుకొనివచ్చి యీ ధ్వజ స్తంభమున కొక ఉట్టి గట్టింపు' మని చెప్పెను. పద్మావతి యట్లే చేసివచ్చి "స్వామీ! నీవు చెప్పినట్లు చేసితిని. ఇంక నన్ను బొందితో స్వర్గమునకుఁబంపు'మనెను. అప్పుడు

మాయలమారి దేవుఁడైయున్న చిలుక 'ఇఁక నుట్టుగట్టుకొని యెక్కు' మని దానికిఁ జెప్పెను. అందులకుఁ బద్మావతి పైకెక్కఁజాల ననెను. అంతలోఁ జిలుక ధ్వజస్తంభము మీఁద నిలిచి, వేశ్యనుజూచి, "ఓసీ! ఉట్టికెక్కలేని దానవు స్వర్గమున కెట్లెక్కెద'వని పలికి, యావింతఁ జూడవచ్చిన వారికెల్లరకును దన వృత్తాంతముఁ దెలిపి దానిని నిందింపఁ జేసి, యటనుండి తిన్నగాఁ బోయి యుజ్జయినిలో నుండు మంత్రికి, శంబరుఁడు చేసిన దుష్కృత్యము నెఱింగించెను. అప్పుడు మంత్రి రాణులతో నాలోచించి యొక చిలుకను జంపించెను. దానికొఱకు రాజుభార్య మొదలగు వారేడ్చు చుండఁగా దానిని బ్రతికించుటకు శంబరుఁడు తన శరీరము నొకచోటనుంచి చిలుక శరీరమునఁ బ్రవేశించెను. అంతలోఁ జిలుక బొందియందున్న విక్రమార్కుఁడు తన శరీరమునఁ బ్రవేశించి యెప్పటివలె రాజయ్యెను. శంబరుఁ డిఁకనేమి సేయఁజాలక దిక్కులేని పక్షియై వెడలిపోయెను. కావున మన మొకరిని మోసగింపఁ దలంతుమేని, తుదకు మనమే మోసపోదుము. మఱియు నద్దానఁ బ్రాణహానియు సంభవించును.

# 22 ప్రవర్ధనుఁడు

పరివర్ధనుఁడను వాఁడు యయాతి మనుమలలో నొక్కఁడు. ఈతఁడు ధర్మసంధుఁడు. భగవద్భక్తుఁడు. మును లను భూసురులను ననుదినముఁ బూజించుచుండును. ఈతని మందిరమున నొకనాఁడు నారదమునీంద్రుఁడు వచ్చెను. పరివర్ధనుఁ డాతని రాకకు మిగుల సంతోషమును బొంది, యనేక రీతులఁ బూజించి, తన మందిరమునఁ గొన్ని దినము లుండఁ గోరెను. నారదుఁడు సమ్మతించెను. ప్రవర్ధనుఁడును నారదుఁడు సంప్రీతిఁ బొందునట్లు సేవలు సేయుచు నాతని కృపకుఁ బాత్రుఁడయ్యెను. ఇట్లుండ నొకదినమున నార దుఁడు రాజుంగాంచి, "రాజా! నాకు నీపురమంతయుఁ, జూడఁ గోరిక యగుచున్నది. కావున నన్ను రథముపైఁ గూర్చుండఁబెట్టి పురమంతయుఁ దిప్పికొని రమ్ము.' అని పలికెను. పరివర్ధనుఁడందులకు సంతోషించి, నాలుగు గుఱ్ఱములు గట్టిన రథముపై నారదుని నాసీనుంజేసి, తానే సారథియై నగరమునందెల్ల యెడలఁ దిప్పుచుండెను. ఆ సమ యమున నొక బ్రాహ్మణుఁడు వచ్చి యా రాజు నొక యశ్వము నిమ్మని కోరెను. "నేనిప్పుడే మందిరమునకు వచ్చుచున్నాను. అచ్చటికి రమ్ము. నీ కోరికఁ దీర్తు"నని యాతఁడు బదులు చెప్పెను. కాని భూసురుం డందులకు

సమ్మతింపక “ యీ క్షణమందే కావలయు”నని కోరెను. అంతటఁ బ్రివర్ధనుఁ డారథమునకుఁ గట్టబడిన గుఱ్ఱములలో నొకదాని నిచ్చి యా బ్రాహ్మణునిఁ బంపెను. కొంత దూరము పోయిన తరువాత మరల మువ్వురు బ్రాహ్మణులు వచ్చి మూఁడు గుఱ్ఱముల నడిగిరి. ప్రివర్ధనుఁడు మారు మాట వలుకక యా మూఁడు గుఱ్ఱముల నిచ్చివేసి, తానే రథము లాగఁదొడంగెను. ఒక్క సమయమునందే బ్రాహ్మణు లట్లువచ్చి తన్ను గుఱ్ఱము లడుగుటచేతను, దానే రథము లాగవలసివచ్చుట చేతను గోపమువచ్చి ‘బ్రాహ్మణులకు దానమీయఁ గూడ’దని యతఁడు తనలోఁ దా ననుకొనెను. ఇందువలన నారదుం డతనియెడ విముఖుండై యనుగ్రహింపక వెడలిపోయెను. ఎన్ని ఘనకార్యము లాచరించిన నేమి? ఎంతటి దానపరుండైన నేమి? కష్టములు గల్గినప్పుడు మనోధైర్యమును, నోర్పును, బాయనివాఁడే ధన్యుడగును. ఒక్కొక్కయెడ నొకయల్పదోషమే ఘనకార్యంబులన్నిటిని జెఱచును. అందుకనే నూరునోములు ఒక రంకుతోఁ జెడునని మనవారు సెప్పుదురు.

# 23 సత్రాజిత్తు

శ్రీకృష్ణుఁడు ద్వారక యందున్న కాలమున నా పుర మునందే సత్రాజిత్తను నొక భాగ్యవంతుఁ డుండెను. ఆతఁడు ప్రభాకరుని యనుగ్రహమున శ్యమంతకమను పేరుగల యొక గొప్ప రత్నమును బడసెను. ఆమణి యను దినము నెన్నియో మణుగుల బంగారమును గురియుచుం డును. అట్టి మణి నొకనాఁడు సత్రాజిత్తు ధరించి కృష్ణునిఁ జూడఁబోయెను. నవ్వులాటకై యా మణిని దన కిమ్మని కృష్ణుఁడు సత్రాజిత్తు నడుగఁగా నతఁడు దానినొసంగనని చెప్పెను. తరువాత మఱి కొన్ని దినములకు సత్రాజిత్తుని తమ్ముఁడగు ప్రసేనుఁ డామణిని ధరించి వేటకరిగెను. అయ్యరణ్యములోఁ బ్రసేనుని నొక సింహము వధించి యాతని మెడనున్న రత్నమును నోటఁగఱచికొని పోవు చుండ, భల్లూకేంద్రుఁడయిన జాంబవంతుఁ డామృగేంద్ర మును జంపి, యా మణిని దీసికొనిపోయి తనబిడ్డ యుయ్యె లకు నాటబొమ్మ పగిది వ్రేలాడఁ గట్టెను. సత్రాజిత్తు సంధ్యా సమయమునకుఁ బ్రసేనుఁ డింటికి రాకపోవుటచే, సేవకులఁబంపి, ప్రసేనుని వెదకించి యతనిచావు నెఱింగిన వాఁడై యంతకుమున్ను దన్ను మణినడిగి యుండుటచేఁ

గృష్ణుఁడే తన తమ్మునిఁ జంపి మణిని హరించెనని నింద వేసెను.

సత్రాజిత్తు తనపై నింద మోపినాఁడను సంగతి కృష్ణుఁడెఱింగి, యా నిందఁ బాపుకొనుటకై బయలుదేరి, ప్రసేనుఁడేగిన యరణ్యమునకేగి, జాడలంబట్టి జాంబవంతుని గుహం బ్రవేశించి, యందుయ్యేలకుఁ గట్టఁబడియున్న మణిం జూచెను. అంత నామణినిగూర్చి జాంబవంతునకును గృష్ణునకును గొప్ప యుద్ధము జరిగెను. తుదకు జాంబవంతుఁడు కృష్ణునిఁ భగవంతునిగా నెఱింగి, మణి నొసంగుటయేగాక తన పుత్త్రికయగు జాంబవతింగూడ నొసంగెను. అట్లు కృష్ణుఁడు శ్యమంతకమును దెచ్చి సత్రాజిత్తునకు జరిగిన సంగతి యంతయుఁ జెప్పెను. భగవంతుడగు కృష్ణునిపై నకారణముగా నింద వేసితినని సత్రాజిత్తు పశ్చాత్తాపము నంది, యమ్మణితోఁగూడ బాలామణియైన తన పుత్త్రికను సత్యభామను నాతనికిచ్చి మహా వైభవముతోఁ బెండ్లి యొనర్చెను.

# 24. మైత్రేయుఁడు

పాండవులు అరణ్యావాసముఁ జేసివచ్చిన తరువాతఁ దమ రాజ్యభాగమును దమకిచ్చునట్లు గోరుటకుఁ గృష్ణునిఁ గౌరవుల కడకు దూతగాఁ బంపిరి. కృష్ణుఁడు హాస్తినాపురమునకు వచ్చెనని విని, యమ్మహాత్ముని జూచుటకును, నాతఁడు సంధింగూర్చి కౌరవులతోఁ బ్రశంసించు విషయముల వినుటకును, బెక్కుమంది మునీంద్రులుగూడ వచ్చిరి. అందులో మైత్రేయుఁడను మునీంద్రు డుండెను. ఆతఁడు మిగుల తపోమహిమ గలవాఁడు. కృష్ణుఁడు కౌరవ సభను బ్రవేశించెను. అంతకు మున్నే యాసభ- మైత్రేయాది మునులచేతను, భీష్మ ద్రోణ విదురాదులచేతను నలంకరింపఁబడి యుండెను. కృష్ణుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పవలసిన మాటలు సెప్పిన యనంతరము దుర్యోధనునకుఁ బాండవులతో సంధిసేసికొనవలసినదని యనేక విధంబుల బోధించెను. కాని దుర్యోధనుఁడు వినక- పాండవులకు సూదిమొనమోపినంత భూమియైన నొసంగనని గట్టిగాఁ జెప్పెను. అప్పుడు మైత్రేయుఁడు దుర్యోధనుని జూచి యిట్లు వలికెను. 'రారాజా! దుర్యోధనా! ధర్మసంధులగు పాండవుల నడవికిఁ బంపితివి. ఇప్పుడు రాజ్యభాగము నీయ ననుచుంటివి. ఇయ్యది నీకు ధర్మముగాదు. వారి

యర్థరాజ్యమును వారికిచ్చి సుఖింపుము. భగవంతుఁడయిన వాసుదేవుఁడు దూతయై వచ్చినాఁడు. ఈతని వాక్యములఁ ద్రోసిపుచ్చవలదు. నీవు సంధిఁ జేసికొంటివేని యుభయ కులములు వర్థిల్లగలవు.' మైత్రేయుని వాక్యములు విని, దుర్యోధనుఁ డామునిపుంగవునిలక్ష్యముసేయక 'మునీంద్రా! మీరు తపము సేసికొనుచుఁ గాలము గడుపుచుండువారు. క్షత్రియోచిత ధర్మములు మీకుఁ దెలియవు. మేము మిమ్మును మాకార్యమునందు ఆలోచనఁ జెప్పుటకు రమ్మని ప్రార్థింపలేదు. అట్టిచో ననవసరముగ మీరేల యిట్టి కార్యములయందుఁ బ్రవేశించెదరు? ప్రపంచములో నన్నెవ్వరు నేమియుసేయఁజాలరు." అని పలుకుటయేగాక, భయములేదని తొడగొట్టెను. దుర్యోధనుని కృత్యమునకు మైత్రేయుఁ డలిగి 'మునులను లక్ష్యముసేయక తొడఁ జఱచుచుంటివి గావున నిన్ను ఘోరరణంబున భీముఁ డూరుభాగమునందుఁ గొట్టియే చంపుఁగాక' యని శాపమిచ్చెను. తుదకు దుర్యోధనుఁడట్లే భీమునిచేఁ గూలెను.

కావునఁ బెద్దల నెప్పుడును అవమానించి పలుకరాదు.



# 25 ధర్మరాజు

కురు పాండవ యుద్ధమున నొక దినమున ద్రోణుని పరాక్రమ విజృంభణమునకుఁ దాళలేక పాండవ బలములు నలుదెసల బరుగిడఁ దొడంగెను. అర్జునుఁ డిందులకుఁ గర్తవ్య మేమని కృష్ణు నడిగెను. "ద్రోణుని చేతిలో నాయుధ మున్నంతవఱ కాతని నెవ్వరును గెలువఁ జాలరు. సామాన్యములగు మా యోపాయంబులవలన నాతఁ డాయుధమును విడువఁడు. అశ్వత్థామ చచ్చెనని చెప్పితిమేని యాతఁ డస్త్రసన్యాసముఁ గావించును." అని కృష్ణుఁడు చెప్పెను. తన కస్త్రవిద్య నేర్పిన గురునిపట్ల నట్టి కార్యము సేయుటకు నర్జునుఁ డంగీకరింపలేదు. భీముఁడు మాళవేశ్వరుని గజమును నశ్వత్థామ యను పేరుగలదానిని జంపి, ద్రోణుని సమీపించి, యశ్వత్థామ చచ్చెనని పలికెను. భీముని మాటలు ద్రోణుఁడు నమ్మక "నీమాటలు నేను నమ్మను. ధర్మరాజు చెప్పిన నమ్మెద" నని పలికెను. వెంటనే కృష్ణుఁడు ధర్మరాజుం జేరి, ద్రోణుని పరాక్రమంబును దెలిపి, యశ్వత్థామ చచ్చెనని యాతనిముందటఁ బలుకవలసినదని బోధించెను.

ధర్మరాజు - అసత్యమాడువాఁడు గాఁడు. ఆతఁ డందులకు సమ్మతింపలేదు. అప్పుడు కృష్ణుఁడు "ధర్మనం

దనా! నీవీపని సేయకుంటివేని మన సైన్యము లన్నియు నేఁడే ద్రోణుని శరాగ్నిలోఁ బడి భస్మమగును. కావున నేనునాదారిఁబోయెద. నీతమ్ములనునీవు రక్షించుకొనుము." అని బెదరించెను. ధర్మరాజున కట్లుచెప్పుట తప్పలేదు. తరువాత ధర్మరాజు ద్రోణునిజేరి "చచ్చెఁజచ్చె అశ్వత్థామ" యని బిగ్గఱగాఁ బలికి తరువాత గజమని మెల్లగా ననను. నెమ్మదిగాఁ బలికినమాట ద్రోణుఁడు వినలేదు. ధర్మరాజు నోటినుండి యశ్వత్థామ చచ్చెనను మాట విన్నంతనే యాతఁ డస్త్రసన్యాసమొనర్చి పుత్రునికై శోకించుచుండ, వెనుకనుండి ద్రుపదుని పుత్రుఁడగు ధృష్టద్యుమ్నుఁడు వచ్చి యాతని కొంతుకఁ గోసెను.

అసత్యము బలికినందువలన ధర్మరా జేడుగడియలు నరకమునఁ బడెను.

# 26 ఆభాగుఁడు

సూర్యవంశమున ధృష్టుఁడను రాజు గలఁడు. ఆతఁడు మిగుల న్యాయవర్తనుఁడు. ఆతనికి నాభాగుఁడను కుమారు డుండెను. సమస్తవిద్యలను నేర్చిన యాతఁ డొకనాఁడు స్వయంప్రభయనువైశ్యకన్యకనుగాంచి మోహించి యౌవన గర్వముచే నామె తండ్రిం జేరి, యామెను దనకిచ్చి పెండ్లి సేయవలసినదని యడిగెను. అందు కతఁ డది ధర్మశాస్త్ర పద్ధతి కాదని పలుకఁగా రాజకుమారుఁడు గోపించి “నీవు నీకూతును నాకీయవేని బలవంతముగాఁ గొనిపోవుదును. నన్నెవ్వరు వారింతురో చూచెద” నని గంభీరముగాఁ బలి కెను. అప్పు డాకన్నియతండ్రి భయమంది, రాజుకడకరిగి యావృత్తాంతమును దెలిపెను. అంతట ధృష్టుఁడు, కుమా రుఁడనియైన దలంపక యాతనిం బట్టి తెప్పించి తగినట్లు శిక్షించెను. ప్రజలెల్లరు నాతని నిష్పక్షపాత బుద్ధికి సంత సించిరి. నాటినుండియు నాభాగుఁడు తన బుద్ధిని మరల్చి మంచిమార్గమున నడువఁ జొచ్చెను.

ధృష్టుఁడు వృద్ధుఁడయిన పిదప నాభాగునకు రాజ్య మిచ్చి, తపోవనమునకుఁ బోయెను. ఆభాగుఁడు పెక్కేండ్లు రాజ్యమును బాలించి వయస్సు ముదిరినయంతఁ దన కుమా రులకు రాజ్యమిచ్చి తపస్సునకుఁ బోయెను. ఆతఁ డట్లరి

గిన కొన్ని దినములకుఁ గుమారు లందఱును గడ గొట్టి వానితో "నీకు రాజ్యభాగము లేదు. కావునఁ దపోవృత్తి నున్న తండ్రియొద్దకుఁ బొమ్ము." అని వెడలఁ గొట్టిరి. ఆతఁ డన్నలమాటల కేమియు బదులుసెప్పక, యడవిలో నున్న తండ్రిం జేరి యన్నలు చేసిన విధంబంతయు నెఱింగించెను. అభాగుఁ డాకుమారునిఁజూచి "ఈవిషయములో నీవు నీయన్నలతోఁ గలహించుట మంచిది కాదు. ఇప్పుడు నైమిశారణ్యమునఁ గొందఱు తాపసులు పాప పరిహారార్థము యాగములు సేయుచున్నారు. కావున నీవచ్చటికిఁ బోయి, పాప పరిహార మంత్రములఁ జదువుము. వారు నిన్ను మెచ్చి, యాగములు సేయగాఁ మిగిలిన ధనము నీకొసంగుదురు. దానిచే నీవు ధనవంతుఁడ వగుదువు." అని పలికెను. తండ్రి యాజ్ఞను శిరసావహించి యతండు యజ్ఞము జరుగు స్థలమునకుఁ బోయి, మంత్రములు సదువఁగా - నచ్చటి మునులు క్రతుశేషధనమునునాతని కిచ్చిరి. ఆతఁడు దానిని గైకొని వచ్చుచుండఁగా రుద్రుఁడు వచ్చి "ఇదినా ధన" మని పలికి యడ్డగించెను. "యజ్ఞశేషమయిన ధనమును మునులు నాకిచ్చినారు. నేను దెచ్చుకొనుచున్నాఁడ" నని పలుకుచు నాతఁ డాభాగునికడకు వచ్చెను. రుద్రుఁడు గూడ వచ్చి యతనితో "నీకుమారుఁడు నాకురావలసినధనమును గైకొనె" ననిచెప్పెను. అప్పు

డా భాగుఁడు "యజ్ఞ శేషము రుద్రునకే చెందవలయును. కావున నీవు తెచ్చిన ధనమంతయు నమ్మహానుభావునకే యి" మ్మని కొడుకునకుఁ జెప్పెను. అక్కుమారుఁ డట్లు చేసెను. రుద్రుఁ డాభాగుని నిష్పక్షపాత బుద్ధికి సంతసించి యతఁడు గైకొన్న ద్రవ్య మంతయు మరల నాభాగుని పుత్రునకిచ్చి, యాతనిని బ్రహ్మజ్ఞానిగాఁ జేసెను. తండ్రిమాట జవదా టని వారికి సర్వ శుభములు చేకూరును.



# 27 విశ్వామిత్రుఁడు

సూర్యకులమున గాధియను నొక నృపాలుఁ డుండెను. ఈతని పుత్త్రుఁడే విశ్వామిత్రుఁడు. తండ్రి యనంతరమున నీతఁడు రాజయ్యెను. ఈతఁడు మహా బలపరాక్రమ వంతుఁడు. ఈతనిపేరు విన్న రాజులెల్లరును గడగడలాడు చుండెడివారు. ఒకనాఁడీతఁడు వేటకరిగి, సమీపమున నున్న వసిష్ఠమహాముని యాశ్రమమునకుఁ బోయెను. వసిష్ఠుఁడీతనిని బహువిధముల గౌరవించి యాతనికి సైన్య సమేతముగా విందొసంగెను. వసిష్ఠుని యొద్దఁ గామ ధేనువుండెను. అదియే యందఱకును భోజనపదార్థముల సమకూర్చెను. విశ్వామిత్రుఁ డాకామధేనువును జూచి, యది తన యొద్దనుండిన బాగుండునని తలంచి, దానిం దన కిమ్మని వసిష్ఠునడిగెను. వసిష్ఠుఁ డందులకు సమ్మతింప లేదు. ఈ విషయములో వారిద్దఱికిని గొప్ప కలహము సంభవించెను. ఎట్లయినను వసిష్ఠుని గెలిచి కామధేనువును దీసికొని పోవలయునని తన శక్తి నంతయు గాధేయుఁడు చూపెను. కాని వసిష్ఠుని తపోబలము ముందు విశ్వా మిత్రుని బాహు బలము వ్యర్థమయ్యెను. వసిష్ఠుని బ్రహ్మ తేజమునకు విశ్వామిత్త్రుఁ డత్యద్భుతమును బొంది, యట్టి తేజమును దానుగూడఁ బొందఁగోరి, తిరిగి పురమునకుఁ

బోవక, యొక యరణ్యమునకుఁబోయి ఘోరముగాఁ దపము సేయఁ దొడంగెను. ఆతని తపమున కనేక విఘ్నములు గలిగినను బట్టుదల వీడకుండెను. అప్పుడు బ్రహ్మ ప్రసన్నుఁడై యాతనిని రాజర్షిగాఁ జేసెను. కాని విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షి యగుటకే యిట్టి తపమునందుఁ బ్రవేశించెను. అందుచే నతఁడు మరల మహానిష్ఠతోఁ దపము సేయుట కారంభించెను.

ఇట్టి సమయమునఁ ద్రిశంకు నృపాలుఁ డొక యాగమును సేయఁ దలఁచి, తనకులగురుఁడైన వసిష్ఠుని నాక్రతువుఁ జేయించుటకుఁ బిలిచెను. వసిష్ఠుఁ డాసమయమున మఱియొక క్రతువుఁ జేయించుచుండుటచేత, నది పూర్తియైన తరువాత వచ్చెద నని చెప్పెను. అప్పుడు త్రిశంకుఁడు విశ్వామిత్రున కీసంగతిఁ దెలిపెను. విశ్వామిత్రుఁ డతనిచేఁ గ్రతువుఁ జేయించి బొందితో స్వర్గమునకుఁ బంపెను. ఈకార్యమునందుఁ గౌశికుని తపము కొంత వ్యర్థమయ్యెను. తరువాతఁ దన మేనల్లుఁడగు శునశ్శేఫుఁడు యజ్ఞపశువుగా బంధింపఁబడ నతని సంరక్షణార్థము గొంత తపమును వెచ్చించెను. కాని తిరిగి యాతఁడు చిత్తముఁ జలింపనీయక తపము సేయుచుండఁగా, దేవేంద్రుఁ డాతని తపమునకు భంగము గలిగింప, మేనక యను దేవ వేశ్యను బంపెను.

విశ్వామిత్రుఁడు దాని మాయలోఁ బడి, దాని యందు శకుంతల యను పుత్రికను గాంచెను. ఈసందర్భమునఁ గొంత తపస్సు వ్యర్థమయ్యెను. తన తపస్సంతయు నీవిధముగా వ్యర్థమగు చుండుటకుఁ గారణము లరసి యాతఁడప్పుడు తొల్లింటి తపోభూమిని విడిచి, మఱియొక స్థలమున కరిగి జితేంద్రియుఁడై తపము సేయ సాగెను. అప్పుడు బ్రహ్మ యాతనికి సాక్షాత్కరించి "గాధేయా! నీతపస్సిప్పటికి ఫలించినది. నేటికి నీవు బ్రహ్మఋషివైతి" వని పలికెను. విశ్వామిత్రుఁడు బ్రహ్మకు నమస్కరించి "మహానుభావా! నీవు నాయందుఁ గరుణ వహించి నందులకు సంతోషించితిని. కాని, యొక విషయమును మాత్రము విన్నవించుకొనుచున్నాను. నేనీ తపము సేయుటకు వసిష్ఠునిపైఁగల వైరమే కారణము. కావున నాతఁడు వచ్చి నన్ను బ్రహ్మర్షి యనినఁ గాని నేను దపంబు సాలింప" నని పలికెను. అప్పుడు బ్రహ్మ వసిష్ఠుని రావించెను. వసిష్ఠుఁడు విశ్వామిత్రునిఁ జూచి మనఃపూర్వకంబుగ "నీవు బ్రహ్మర్షివైతి" వని పలికెను. అంత విశ్వామిత్రుఁడు దపంబు సాలించెను. నాటినుండి యాతఁడు సప్తఋషులలో నొక్కండై మహాప్రభావ సంపన్నుండయ్యెను. కావున బాలకులారా! పట్టుదల యను నది యొకటి యున్నచో నెంతటికార్యముల నైనను మనము సాధింపఁగలము.

# 28 సుమేధుఁడు—సామవంతుఁడు

సుమేధుఁడు - సామవంతుఁడు నను నిరువురు బ్రాహ్మణు లతి మైత్రిం దగిలి వర్తించుచుండిరి. వారిరువు రును బెండ్లిండ్లు సేసికొనఁ దలఁచి, విదర్భ దేశాధీశ్వరుని కడకుఁ బోయి ధనము నడిగిరి. ఆరాజేంద్రుఁడు వారిఁ గాంచి "బ్రాహ్మణోత్తములారా! మీకుఁ గావలసినంత ద్రవ్య మొసంగుటకు నేనసమర్థుఁడనై యున్నాను. ఇచ్చటి కనతిదూరమున సీమంతినియను సాధ్వీరత్న మొక మహా వ్రతముఁ జేయుచున్నది. ఆమెయచ్చటికివచ్చిన దంపతులకుఁ గావలసినంత ద్రవ్యమిచ్చుచున్నది. కావున మీలోనొకరు స్త్రీవేషముధరించి దంపతుల చందమున నటకుఁబోయితిరేని కావలసినంత ద్రవ్యము లభించు" నని చెప్పెను.

ఆమాటలువిని సామవంతుఁడు స్త్రీవేషమును దాల్చెను. అంతట వారిరువురు సతీపతులవలె సీమంతినికడ కరిగిరి. సీమం తిని సేయుచున్న వ్రతము పూర్తియైనంతనే, యాకృత్రిమ దంపతులను బూజించుట కామె పిలిచెను. సీమంతిని సాధ్వీ రత్నమగుటచే, సుమేధుఁడును, సామవంతుఁడును ధనము నకై చేసిన కపటము నెఱిఁగి తనమనంబున "వీరు సతీ పతులే యగుదురుగాక" యని తలంచి, వారికిఁ గావలసిన ద్రవ్యమును- వస్త్రముల నిచ్చి పంపెను.

తరువాత వారిరువురును నచ్చటనుండి బయలుదేరి యొక యరణ్య మార్గమునఁ బోవుచుండిరి. అప్పుడు సామవంతుఁడు-సుమేధునిఁ జూచి "నాథా! నేను దొందరగా నడువలేక యున్నాను. నాచేయిఁ బట్టుకొని తీసికొని పొమ్ము" అనిపలికెను. సామవంతుఁడెగతాళికట్లు మాటలాడుచున్నాడని తలంచి సుమేధుఁడు "మిత్రమా? నీచిత్తమేమయినఁ జలించినదా యేమి ? ఇట్టి మాటలఁ బలుకుచుంటివేల ? స్త్రీ వేషము వేసితినని యిట్లు పలుకుచుంటివా? చాలు చాలు. ఇంక స్త్రీవేషమును మాని యెప్పటియట్ల పురుషుండ వగుము. తెలిసిన వారెవ్వరైనఁ జూచిన నవ్వుదురు"అని పలికెను. అందులకు సామంతుఁడు"నేను నిజముగా నీభార్యనే" యని పలికెను. సుమేధుఁ డామాటల కద్భుత మందుచుండఁగా సామవంతుఁడు నిజమయిన స్త్రీయై యాతని చేయిఁబట్టుకొనెను. సుమేధుఁడదిచూచి భయమంది తొందరగాఁ బోయి యావృత్తాంతము సామవంతుని తండ్రికెఱింగించెను. సీమంతినీమహిమచే నట్టిది సంభవించెననిగ్రహించి యాసామవంతుని తండ్రి విదర్భరాజు కడకుఁబోయి "ఓయీ రాజా! నీకడకు వివాహార్థమై ధనము కొఱకు నాపుత్రుఁడును, నతని మిత్రుఁడును నీయొద్దకు వచ్చిరి. వారికి నీవు దుర్బోధగావించి సీమంతినికడకుఁ బంపితివి. ఇప్పుడు నా పుత్రుఁడు స్త్రీయయ్యెను. నీవు నాపుత్రుని నెప్పటివలెఁ

జేయుము. లేదేని నీవంశమెల్ల నీరగునట్లు శపించెద" నని కోపముతోఁ బలికెను. విదర్భరాజు భయమంది, యేమి సేయుదునాయని విచారించుచుండ, నతని గురుఁడగు భరద్వాజుఁడు వచ్చి, యాతనికి ధైర్యము సెప్పి, పరమేశ్వరి నారాధింపుమని యొక దివ్యమంత్రము నుపదేశించెను. విదర్భరాజు పరమేశ్వరినిఁ బ్రార్థింప నామె ప్రత్యక్షమయ్యెను. ఆరాజేంద్రుఁడామెకు మ్రొక్కి "తల్లీ! సామవంతుని బురుషునిఁగాఁ జేసి నన్ను రక్షింపు" మని ప్రార్థించెను. అందులకు జగదీశ్వరి "రాజా! సాధ్వీమణి పలుకులు రిత్తయగునే? నే నాతనిని బురుషునిఁగాఁ జేయఁజాలను. కాని సామవంతునిఁబోలు పుత్రుని మఱియొకని నాతని తండ్రికిఁ బ్రసాదించెద" నని పలికెను. అందుల కందఱు నానందించిరి. కృత్రిమదంపతులగు సుమేధసామవంతులు నిజమైన దంపతులయిరి. కావున మహాత్ములయినవారిని మోసగింతుమేని మనకే కీడు మూడును.

# 29 బంధుకుఁడు

నందినీనామ నగరమున బంధుకుఁడను నొక బ్రాహ్మణుఁడుండెను. ఆతఁడు పూర్వము ధనికుఁడై యుండెను. కాని తరువాత నాతఁడు నిరుపేదయయ్యెను. ఆతనికిఁ బుత్రులు గూడఁ బెక్కండ్రుగలరు. ఆతఁడు తన దారిద్ర్యమునుండి తొలఁగుటకు మార్గమేమియుఁగానక తుదకు చిత్రవర్ణి నగరములో నున్న తనతమ్ముని కడకుఁబోయి తనవృత్తాంతముఁ దెలిపి యాతనివలనఁ గొంత ధనముఁ దెచ్చుకొనఁ దలంచి, యా సంగతిఁ దన భార్యకెఱింగించి బయలుదేరెను. ఆతఁడు దిన దిన ప్రయాణములుసేయుచు సుఖముగాఁ జిత్రవర్ణి నగరమునుజేరి తన తమ్ముఁడైన విపులుని గృహంబునకేగెను. విపులుండగ్రజుని రాకకు మిగుల సంతోషించికౌఁగిలించుకొని యనేకవిధములఁబూజించెను. విపులునిభార్యయు బిడ్డలును బంధుకునియెడల మంచి మనస్సు గలవారై యుండిరి. విపులుండగ్రజుని పేదఱికముఁగూర్చి మిగుల విచారించి యాతనికిఁ దగుసహాయము సేయఁదలఁచి యొక నాటిరాత్రి యొక భూరుహముచెంత కాతనిం దీసికొనిపోయి యిట్లుసెప్పెను. 'అగ్రజా? విధికృతంబు నెవ్వరును దాటఁజాలరు. నీదారిద్ర్యము నాకెంతయు విచారము గలిగించుచున్నది. నీకు నాచేతనైనంతవఱకు సహాయము సేయుదును. నీకు ద్రవ్యము మోసికొనిపోవుట మిగుల కష్టముగనుండును.

అదియుంగాక నీవు పోవునది యరణ్యమార్గము. దారియందు దస్కరబాధ యెక్కువగ నుండును. కావున నొక మాణిక్యము నీకొసంగెదను. దానిని నీవు మ్రింగి జీర్ణమలినాంబరములధరించి ఉదయముననే యరుగుము.'' అని చెప్పి యమూల్యమగు నొక మాణిక్యమిచ్చెను. తరువాత యిర్వురును మందిరమునకుఁబోయి శయనించిరి.

వారిరువురును మాటలాడుకొనుట సాభూరుహము చాటుననున్న యొక చోరుఁడువిని తనకు ద్రవ్యమునకై మంచిమార్గము దొరికెనని సంతోషించి బంధుకుని ప్రయాణమునకై వేచియుండెను. మఱునాఁ డుదయమున బంధుకుఁడు బయలుదేరి నిజనగరమునకు వచ్చుచుండెను. అతనికొఱకు వేచియున్న చోరుఁడుగూడ నాతనితో బయలుదేరి సజ్జనుని వోలె సముచిత ప్రసంగంబులాడుచు నతనివెంట నరుగుచుండెను. చోరుఁడు తన మనంబున నింకఁ గొంచెముదూరము పోయినతరువాత బంధుకునిఁజంపి పొట్టచ్చీల్చి మాణిక్యమును హరింపఁ దలంచియుండెను. అంతలో మఱికొందఱు చోరులు వచ్చి వారిరువురను విఱిచికట్టి "వీరిరువురను మాయవేషముల నిట్లు పోవుచున్నారు. వీరికిఁ దెలిసిన యుపాయములు మనకుఁ దెలియకయున్నవా? వీరి యుదరములలో గనక ముండితీరును. కావున వీరి యుదరంబులఁ జీల్చిచూడ'' మని

తలఁచిరి. అందులో నొకచోరుఁడు "ముందుగా నొకని యుద
రము వ్రచ్చి యందుఁ బసిఁడియున్నచో రెండవవాని యుదర
మునుగూడఁ జీల్పవచ్చును. లేదేని వానిని వదలుద"మని
చెప్పెను. అప్పుడు బ్రాహ్మణునివెంట వచ్చిన చోరుఁడు
తన యంతరంగమున "అక్కటా! ఈ నొకటితలఁప దైవ
మింకొకటి సేయు నను పలుకు సత్యమయ్యెను. పాపాత్ముఁడనై
యకారణముగ బ్రాహ్మణునిఁ జంపఁ దలంచితిని. ఇప్పుడీ
చోరులు ముందు బ్రాహ్మణుని కడుపువ్రచ్చి యందు రత్న
మును గాంచిరేని పిదప నాకడుపుఁగూడఁ జీల్చెదరు. ఎట్ల
యినను నాకుఁ జావు తప్పదు, ఇప్పుడు నేనేవిధముగ నయిన
బ్రాహ్మణుని ప్రాణములు రక్షించితినేని నాకుఁ గొంత
పుణ్యము లభించు" నని తలంచి చోరులఁ జూచి ముందుగాఁ
దనకడుపుఁ జీల్పుఁడని పలికెను. అంతట నాచోరులా
చోరుని కడుపువ్రచ్చి యందేమియుఁ బసిఁడి లభింపకపోవు
టచే బ్రాహ్మణుని విడిచిపుచ్చిరి. క్రూరులబారినుండి
యావలఁబడిన బంధుకుఁడు భార్యా పుత్రులఁగూడి సుఖ
ముగా నుండెను. దుశ్చరిత్రుఁడైనను దుదకుఁ బశ్చాత్తాపము
నంది బ్రాహ్మణ ప్రాణరక్షణ మాచరించిన చోరుఁడు ముక్తి
గాంచెను. దుర్మార్గులేనియు నొక్కొకప్పుడు సన్మార్గులై
మహోపకారు లగుచుందురనుట యబద్ధము గానేరదు.

ఓమ్.

# సదుపదేశకథలు

## మూడవ భాగము

కవికుమార,

మహావాది వేంకటరత్నం విరచితము.

ప్రకాశకులు:

శ్రీ లక్ష్మీస్టోర్సు: తెనాలి.

1930.

 (Price Rs 0-3-0)

# తొలిపలుకు

ఉపాధ్యాయులారా!

ఈసదుపదేశకథలు, బాలురకుఁ జక్కఁగాఁ దెలియునట్టి సులభశైలిని నాలుగు భాగములుగా రచియింపఁ బడినవి. ఈసదుపదేశము లన్నియుఁ గథామూలకములు. ఉపదేశములు గథామూలములగుచో బాలురకుఁ బఠనీయములు. బోధనీయములు. ఇది యుపాధ్యాయ సంఘమునకు విదితము. ఇందు వివిధములగు కథలుగలవు. కొన్ని పౌరాణికములు. కొన్ని కల్పితములు. కొన్ని చరిత్రాత్మకములు. కొన్నియెడల నొక భాగమునఁ దెలుపంబడిన కథలే వేఱొక భాగమునఁ దెలుపఁబడినవి. ఇందుకుఁ గథా విపులీకరణమే మూలకారణమని యెఱుంగునది. మఱియునిట్టికథామూలకంబులగు నుపవాచకంబు లెన్నియేనియు బాలురకొఱకిదివఱకే పుట్టియున్నవి. ఇట్లు పుట్టుటకు వ్యక్తుల యభిరుచులే ప్రధాన కారణములు. అయిన నొకదాని యుత్కృష్టత యింకొకదానికిరాదు. ఉత్కృష్టతనుబట్టియే ప్రాశస్త్యము గలుగుచుండును. కావున నీసదుపదేశకథల గుఱించి ప్రత్యేకముగాఁ జెప్పుటనవసరము. బోధకులే వీని ప్రాశస్త్యమును నిర్ణయింతురుగాక!

---

# విషయసూచిక

22. దశరథుఁడు.
23. గృధ్రము—జంబుకము.
24. గోమాయువు.
25. మార్కండేయుఁడు.
26. ఏకలవ్యుఁడు.
27. పరశురాముఁడు.
28. భీముఁడు.
29 అభిమన్యుఁడు.
30. సృంజయుఁడు.
31. రావణుఁడు.



ఓమ్.

# సదుపదేశకథలు

## మూఁడవ భాగము

## 1 విదురుఁడు

"భక్తిగల్గుకూడు - పట్టెడైనను చాలు"

విదురుఁడను నాతఁడు కౌరవులకు మంత్రిగ నుండెను. ఈతఁడు భగవద్భక్తుఁడు. నీతివిశారదుఁడు. ధర్మశాస్త్రవేత్త. ఈతఁడు కౌరవులను మంచి మార్గమునఁ బెట్టవలయునని యనేక ప్రయత్నములు చేసెను. విదురనీతి నిరాకరణమే కౌరవ నాశనమునకుఁ గారణమయ్యెనని చెప్పవచ్చును.

పాండవులు తమ యర్ధరాజ్యమును దమకిమ్మని యడుగుటకుఁ గృష్ణుని దూతగాఁ గౌరవుల కడకుఁ బంపిరి. కృష్ణుఁడు హస్తినాపురమునకు వచ్చి విదురుని యింట విడిసెను. విదురుఁ డాతనిని భక్తిపూర్వకముగ ననేక విధములఁ బూజించి, యిట్లుపలికెను. "కృష్ణా! కౌరవులు సంధికొడంబడుదురనియే తలంచి నీవిటకువచ్చితివా? నీ వనవసరమైన

శ్రమ నందుచుంటివని నేను విచారించుచున్నాను. దుర్యోధనుఁడు సంధికిచ్చగింపఁడు. పాండవుల కొక వీసమయిన నేలనీయనని పలుకుచున్నాఁడు. తన పక్షమున యుద్ధము సేయుటకు వత్తుమని చెప్పుచున్న యోధులఁజూచి పొంగి పోవుచున్నాఁడు. ఈ విషయ మట్లుండనిమ్ము. ఆ కౌరవులు దుర్మార్గులు. ధర్మచరిత్రుఁడవగు నీకుఁగూడ నాకేమి యెగ్గు సేయుదురో యని సంశయించుచున్నాను కావున నీవు వారి కడకుఁ బోకుండుటయే మంచిదని నే నూహించుచున్నాను.

తన హితమును గోరి వచించిన విదురుని వాక్యములకు సంతసించి కృష్ణుఁడిట్లనెను. "నయకోవిదా! విదురా! నీ వాక్యములు నాకెంతయు మోదముఁ గూర్చుచున్నవి. నీవు తలంచినట్లు నిశ్చయముగా దుర్యోధనుఁడు సంధి కిచ్చగింపఁడు. ఈ విషయము నేను బాగుగ నెఱుంగుదును. కాని, కౌరవపాండవులు తమలోఁ దాము కలహించుచుండఁ గృష్ణుఁ డూరకుండెనని లోకులు దలంపకుండుటకై యిట్లు వచ్చితిని. కౌరవులు నా యెడల నేమయిన ద్రోహబుద్ధిఁ బూనుదురేమోయని నీవు సంశయింపవలదు. నే నలిగితినేని యిచ్చట నన్ను మార్కొను వాఁడెవ్వఁడును లేడు."

ఇట్లు చెప్పి, కృష్ణుఁడు విదురుని వెంటఁబెట్టుకొని ధృతరాష్ట్రుని కడకుఁ బోయెను. అచ్చటనుండి యాతఁడు

దుర్యోధనుని మందిరమునకుఁ బోయెను. దుర్యోధనుఁడు కృష్ణుని బహువిధముల గౌరవించి యానాఁడు తన యింట భుజింపుమనికోరెను. అందుకుఁ గృష్ణుఁడు "దుర్యోధనా! నీ యాహ్వానమునకు నే నెంతయు సంతసించితిని. కాని యొక్క విషయము మాత్రము నీకుఁ జెప్పుచున్నాను. పగ వారి యింట భుజింపరాదు. నేను నీకుఁ బగవాఁడ నెట్లయితి నని యడిగెదవేమో? నీకునుఁ బాండవులకును విరోధ మున్నది. నేను పాండవదూతనై యిట కరుదెంచుటం జేసి నేనుగూడ నీకు విరోధినేయగుదును. నేను వచ్చిన కార్యము ఫలించినచో నేను నీయింట భుజించిన బాగుండును. నేను విదురునియింట భుజింతును. నిష్కల్మషచరిత్రుఁడగు నాతని యన్నము నాకు భుజింప యోగ్యమైయున్నది." అని చెప్పి, యాతఁడు విదురుని గృహమున కేగెను. భగవంతుఁడగు కృష్ణుఁడు తన మందిరమునకు విచ్చేసెనని మహానందమును బొంది, పరమభక్తాగ్రేసరుఁడగు విదురుఁ డామహాత్మున కనేక పదార్థములతో నాతిథ్య మొసఁగి కృతార్థుఁడయ్యెను. విదురుఁడొనర్చిన విందునకును – సేవలకును – వాసుదేవుఁడు తృప్తిఁబొందెను.

# 2 విష్ణుశర్మ

"కాని కాలమందుఁ - గాపాడు నెవ్వఁడు
వాఁడె బాంధవుండు - వసుధలోన!"

పూర్వము విష్ణుశర్మయు-గోవిందశర్మయు నను నిరువు రన్నదమ్ములుండిరి. వీరిరువురు దండ్రి యనంతరమున నాతని యాస్తిని సమముగాఁ బంచుకొనిరి. కొన్నాళ్ళకు విష్ణుశర్మ మఱియొక గ్రామమునకుఁబోయి, యచ్చటనే నివాసమేర్ప ఱచుకొని విశేషముగా ధనము సంపాదించు చుండెను. గోవిందశర్మ తన ధనమంతయు వెచ్చఁబెట్టి నిరుపేద యయ్యె ను. ఈతనికి సంతానముగూడ నెక్కుడుగ నుండెను. పూఁట గడచుటయే యాతనికిఁ గష్టముగనుండెను. ఇట్లుండ నాతని భార్య యాతనిం గాంచి "మనము దుర్భర దారిద్ర్యసాగర మున మునిఁగియున్నాము. పిల్లలకుఁగూడఁ గడుపునిండఁ గూడు లేకయున్నది. పిత్రార్జితమైన మీ ధనమంతయు వెచ్చ బెట్టితిరి. సంపాదించుటకుఁ దగిన మార్గము కనిపింపక యున్నది. ఎన్నాళ్ళు మన మీ కష్టములఁ బడఁగలము. మీయగ్రజుఁడు గడుధనవంతుఁడైయున్నాఁడు. మీరాయన సన్నిధికిఁబోయి మన దుస్థితింగూర్చి చెప్పుకొన్నచోఁ గరుణ వహించి సహాయముసేయునను నమ్మకము నాకున్నది. కావున సంశయింపక మీరటకేగుడు" అని చెప్పెను.

భార్య చెప్పిన మాటలు విని గోవిందశర్మ - బయలు దేరి నెమ్మదిగా విష్ణుశర్మయున్న గ్రామమునకుఁ బోయెను. విష్ణుశర్మ తమ్ముని రాకకు సంతోషించి యెంతయో యాద రించెను. విష్ణుశర్మ భార్యగూడ మఱఁదిని గౌరవించెను. ఇట్లు నాలు గయిదు దినములుండిన పిదప నొకనాఁడు గోవిందశర్మ యగ్రజునకుఁ దన దీనదశను దెలిపెను. తమ్ముని దైన్యమునుజూచి యగ్రజుఁడు "తమ్ముఁడా! బంధువులు ధనని భాగ్యము భాగ్యముగాదు. నేను నీకన్నఁగానను. నీకు సహాయముసేయుటయన్న నాకుఁ బరమానందము" అని పలికి, యాతనికి దారిద్ర్యము వాయునట్లు గొంత సువర్ణ మును గొన్ని రత్నముల నిచ్చి పంపెను. గోవిందశర్మ తన కగ్రజుఁడొనర్చిన సహాయమున కెంతయో సంతసించుచు గృహమును జేరి సుఖముగా నుండెను.



# 3 పూరుఁడు

" తండ్రిమాట వినెడి - తనయుండు సర్వత్ర
సుస్థిరంబులైన - శుభములొందు. "

యయాతి యను నొక నృపాలుఁడుండెను. ఆతనికి దేవయాని శర్మిష్ఠ యను నిద్దఱు భార్యలుండిరి. ఇందులో దేవయాని శుక్రాచార్యుని కూతురు. శర్మిష్ఠ రాక్షసరాజగు వృషపర్వుని కూతురు. ఒక సమయమునఁ దన తనూజ యగు దేవయాని నగౌరవించి, శర్మిష్ఠను జేరెనని శుక్రుఁడు గోపము వహించి యయాతిని ముసలివాఁడ వగుమని శపించెను. అందుకు యయాతి భయమంది, శుక్రాచార్యుని పాదములపైఁ బడి, " ఆచార్యా ! నాకిట్లు శాపమిచ్చుట నీకు ధర్మ మగునా? నలుబది యేండ్లయిన నిండని నాకిప్పుడే ముసలితనమా? భోగములయందు నాకింకను గోరిక తీర లేదు. నాయపరాధమును మన్నించి శాపమును ద్రిప్పుము." అని ప్రార్థించెను. అప్పుడు శుక్రాచార్యుఁడు గరుణవహించి "నీ ముసలితనమును నీ పుత్రులలో నొకనికిచ్చి వాని యౌవనము నీవు తీసికొనుము. నీకు భోగములయం దపేక్ష తీరిన పిదప వాని యౌవనము వానికిచ్చి నీ ముసలితనమును నీవు దీసికొనుము." అని చెప్పిన విని యాతఁడు తన కొడుకుల నందఱను బిలిచి ''కొడుకులారా! మీలో నెవ్వరు మీ

యౌవనము నాకిచ్చి నా ముసలితనమును దీసికొందు?" రని యడిగెను. "చాలు చాలు. నీ ముసలితనము మాకేల? ఈ ముడతలుపడిన శరీరమును, ముందుకు వచ్చిన కాళ్లను జూచి ప్రతివారు నసహ్యపడుదురుగదా!" అని కొడుకులు బదులు సెప్పిరి. తరువాత నాతఁడు శర్మిష్ఠకుఁ గడగొట్టు పట్టియైన పూరునిఁ బిలిచి యడిగెను. పూరుఁడు తండ్రిని జూచి "నాయనా! నీకు సుతుఁడనైనందుకు నీయభీష్టము దీర్చుటకన్న నేఁ జేయు ఘనకార్య మెద్ది గలదు? నాయౌవన మేకాదు. కావలసియున్నచో నాప్రాణముల నయిన నిచ్చెద" నని పలికి, తనయౌవనమును దండ్రికిచ్చి, తండ్రి ముసలితనమును దాను గ్రహించెను. యయాతి యౌవనుఁడై తనివిదీర భోగముల ననుభవించి, మరల పూరుని యౌవనమును బూరున కిచ్చివేసెను. మఱి కొన్నాళ్లకు యయాతి తపస్సునకుఁ బోవుచు, రాజ్యమంతయుఁ బూరునకే యిచ్చి తక్కిన పుత్త్రులు గాని, వారిపుత్త్రులు గాని రాజ్యమేలుట కర్హులుగారని శపించెను.



# 4 వాయసము

"తనకు మించిన పని సేయఁ దగదు తగదు."

ఒక పురమున ధర్మవర్తియగు నొక వైశ్యుఁడుండెను. ఆతఁడు విశేష ధనవంతుఁడగుటయేగాక సంతాన వంతుఁడు గూడ నైయుండెను. ఒకనాఁడాతని గృహమున కొక వాయసము వచ్చినఁ జూచి, యాతని పుత్త్రిలు దాని కెంగిళులు పెట్టి పోషింప సాగిరి. అవ్వాయసమా వైశ్యుని గృహము విడువక, యెంగిళులఁ దినుచు దర్పించి యితర పక్షులను సఱకుఁగొనక యుండెను. ఇట్లుండ నొకనాఁడు సముద్ర తీరమునకుఁ గొన్ని మరాళములు వచ్చినం జూచి, యాకోమటి కొడుకులు వాయసము నచ్చటికిఁ దీసికొని పోయి దానిం జూపి, "వాయసమా! పక్షులయందు గొప్పదానవని పలుకుచుందువు. ఈమరాళములఁ జూచితివా? నీవు వీనితోఁ బందెము వేసి గెలువవలయు" నని పలికిరి. ఆ వైశ్యపుత్త్రిల మాటలకొడ లుప్పొంగ, నయ్యది తనకు స్వల్పకార్యమని చెప్పి, యాహంసములఁ జేరి, యందుఁ దనకిచ్చవచ్చిన దానిం గాంచి తనతోఁ బందెమునకుఁ బఱచుటకు రమ్మని పిలిచెను. అంత నయ్యంచలు, వాయసము పలుకులకు నవ్వి "వాయసమా! మేము నిరంతరము మానససరోవరమున

నివసించుచు నిచ్చవచ్చినచోట విహరించుచుందుము. ఎంత దూరము పోవలసి వచ్చినను నాయాసము లేక పోవఁగలుగుదుము. అట్టిచో మాయందఱిలోన మిగుల జవసత్వములు గలదానిని బందెమునకుఁ బిలిచితివి. మున్నెన్నఁడును హంసలతోఁ బఱచిన కాకులను మేము కనియుండలేదు.'' అని పలికెను. ఆమాటలకు వాయస మిట్లనెను. "నడకయందనేక గతులున్నవి. అవి యన్నియు నాకుఁ దెలియును. అందొక్కొక్క నడకమీఁద నేను పెక్కు యోజనములు పోవఁగలను. అందువలన నేనీయంచను గెలువఁగలను' అందుకుఁ గాకముచేఁ బిలువఁబడిన మరాళము "కాకమా! నీకు నడకయందనేక గతులు తెలియునని వచించితివి. అట్టివన్నియు నాకుఁ దెలియవు. నాకొక్కటే నడక తెలియునని పలికి పఱచుటకు సమ్మతించెను. మరాళవాయసము లంత జలధిపై నాకసంబంటఁ బఱుగిడ నవసరమున రాయంచ నెమ్మదిగాఁ బోవుచుండెను. వాయస మతిరయంబున నాయాస మందుచుఁ బోవుచుండెను. ఉచ్ఛిష్టదర్పితయగు కాకం బనేక విధులఁ బోవుచు, వెనుకనున్న మరాళముదగ్గఱకు వచ్చుచు, మరలి పోవుచు, ముక్కు ముక్కుమీఁద మోపుచు, మరల ముఁదునకుఁ బోవుచు మురియుచుండెను.

కాకము ముందు పఱచుటఁజూచి తక్కినవాయసములు "కాకా''యని సంతోషమునఁ బెద్దబెట్టున నఱచుచు

మరాళము భంగపడునని తలంపసాగెను. కాకుల కలకలము విని మరాళ ముత్సాహాభరితమై మిగుల పొడవున కెగసి యతి రయమునఁ బఱవఁదొడంగెను. మిపుల వేగముగఁ బఱచుట యందుఁ బ్రవీణత్వముగల రాయంచను గలిసికొనుటకు మిగుల ప్రయత్నించి పరుగిడఁజాలక, యక్కాకము తన చిత్తమున "అక్కటా! ముందు వెనుకలరయక దీనితోఁ బఱ చుటకుఁ బందెమువేసితిని. నిలచుటకైన నెక్కడను వృక్ష ములుగాని, పొదలుగాని, యేమియును లేవు. ఇదియంతయు నీటిమయము. దిగితినేని చచ్చుట నిశ్చయము.''అని తలపోసి వికలచిత్తమై భయపడుచున్న యక్కాకిని విలోకించి యమ్మ రాళము 'వాయసమా! నీకుఁ బెక్కుగతులు తెలియునని పలికితివి. ఇదియేగతి? సత్వరముగ నావెంటరమ్ము.' అని గేలిసేయఁజొచ్చెను. అప్పుడు దైన్యమునందియున్న వాయ సము రాయంచంగాంచి "కోమటి కొడుకులుపెట్టిన యుచ్ఛి ష్టమును దిని దర్పించి, నేను గర్వమున నిన్నుఁబఱచుటకుఁ బిలిచి భంగపడితిని. నాయపరాధమును మన్నించి నన్ను దయఁజూచి, రక్షించి మఱలఁ గాకులలోఁ గలుపుము.'' అని పలుకుచు నెగురలేక జలధిలోఁబడెను. మరాళమప్పు డక్కా కిపైఁ గృపనిల్పి తన చరణముల సందున దాని నిఱికించుకొని, మరణభయమునుమాన్పి, తీరంబునకుఁజేర్చి తక్కిన కాకు లన్నియు వినుచుండ నవ్వాయసముతో "ఎదిరి బలము నీ

బలము నెఱుంగకుండ, నెన్నఁడు నిట్టి పనులకుఁ గడంగకు” మని బుద్ధి సెప్పెను.



## 5 హనుమంతుఁడు

‘ స్వామికార్యంబు శ్రద్ధతో – సలుపవలయు

హనుమంతుఁడు కేసరియను వానరవీరునకు అంజని యను కాంతయందు వాయుదేవుని వరమున జన్మించినాఁడు. ఈతనికి బ్రహ్మాదిదేవతలు పెక్కు వరములిచ్చి యుండిరి. ఈతఁడు సూర్యునియొద్ద సమస్తశాస్త్రముల నభ్యసించెను. ఈతఁడు కిష్కింధకుఁబోయి వాలి సుగ్రీవులతో స్నేహాము సేసి వారియొద్దనుండెను. కాని యీతఁడు సుగ్రీవునకుఁ గడుఁ గూర్చు మిత్రుఁడైయుండెను. ఇట్లుండ నొక కారణముపై వాలి–సుగ్రీవుని రాజ్యమునుండి వెడలనడిచెను. అప్పుడు సుగ్రీవుఁడు ఋశ్యమూక పర్వతమును జేరి యచ్చట వసించుచుండెను. తనమిత్రుఁడు కష్టములపాలయినను హను మంతుఁడాతనిని విడువక వెంటనరిగి యా సుగ్రీవునితోడనే వసించుచుండెను. కొన్నాళ్ళ కచ్చటికి, సీతను వెదకుచు రాముఁడు లక్ష్మణ సమేతుఁడై వచ్చెను. హనుమంతుడుఁ సుగ్రీవునకును రామునకును సఖ్యము గలిగించెను.

హనుమంతుఁడు రాముని మహిమను బాగుగ గ్రహించి యాతనికి నమ్మిన సచివుఁడై యుండెను. సీతను నన్వేషించుట కాయా దిక్కులకు సుగ్రీవుఁ డనేక వానరవీరులను బంపెను. హనుమంతుఁడు రాముని యానతిఁగొని లంక కరిగెను. తన కార్యము నెఱవేర్చుటకు హనుమంతుఁడు సమర్థుఁడని తలంచి రాముఁడు తన యుంగరమును సీత కానవాలుగాఁ జూపుట కాతని చేతికిచ్చెను. హనుమంతుఁడు సముద్రమును దాటి - లంకఁజొచ్చి సీతం గాంచి యామెకు రాముని క్షేమముఁ దెలిపి, మరల రాముని సన్నిధికివచ్చి సీత క్షేమము నాతనికిఁ జెప్పి సంతోషము గూర్చెను. రాముఁడు హనుమంతుని భక్తిని మిగుల గొనియాడెను. ఇంతియేగాక యీతఁడు యుద్ధములో రామున కనేక విధముల సహాయ మొనర్చి, స్వామికార్యధురంధరుఁడని పేరుగాంచెను.



# 6 గోమాయువు

'తన్ను నవమాన పఱచిన - తత్క్షణమునఁ
బ్రాణసఖుఁడైన విడనాడ - వలయు నెఱిఁగి!'

ఒక్కొక్క సమయమున మంచివారు చెడ్డవారుగను, చెడ్డవారు మంచివారుగను గనుపించుచుందురు. అయ్యది బాగుగ నెఱింగి స్నేహము సేయవలయును. పూర్వము పురికయను పట్టణమేలురాజు విధికృతమున గోమాయువై జన్మించెను. అతఁడట్టి జన్మమునందినను బూర్వజ్ఞానము మాత్రము గలిగియుండెను. ఆ జంబుకము మాంసమును భుజింపక దుంపలు, ఫలములు మొదలగు వాని నాహార ముగాఁ గైకొని యరణ్యమునఁ గాలము గడపుచుండెను. తోడి నక్కలు దానిం గాంచి 'ఇదియేటివ్రతము? వెఱ్ఱివై యిట్లు సేయుచుంటివేల? నీకు మాంసమును దెచ్చి మే మొసంగుదుము. సుఖంబుగా నుండు' మని చెప్పినను నయ్యది యందు కంగీకరింపక నిరశన దీక్షం బూనియుండెను.

ఇట్లుండ నొకనాఁడు దానిచెంత కొక వ్యాఘ్రం బరుదెంచి యిట్లుపలికెను. 'జంబుకమా! నీవు మహాధర్మ పరుఁడవని యరణ్యమునఁగల మృగములన్నియుఁ జెప్పఁగా వింటిని. లోకులు నన్నుఁ గ్రూరాత్ముఁడని పలుకుచున్నారు. నీతో నేను మైత్రిందగిలి యుండెదను. నీ శిక్షం

జేసి నాక్రూరత్వముఁ బాపవలె''నని పలికెను. అందుకా నక్క పులిం జూచి యిట్లుపలికెను. "నీవు భోగంబులయం దాసక్తి గలవాఁడవు. నా మనస్సు మాత్ర మట్టివానియం దెప్పుడును బ్రవేశింపదు. పోనిమ్ము. నీ భోగముల మాట నాకేల? నాయెఱింగిన ధర్మములు నీ కెఱింగించెదను. కాని యొక్క విషయమున మాత్రము నేను సంశయ మందు చున్నాను. నీవు నాతోడ మైత్రి వాటించితివేని, నీహితు లసూయ వహించి, భంగము గావించుట కనేకయత్నములు సేసి, నీచిత్తము నాకఱ్ఱింతురు. అందుచే వారేమి సెప్పినను వినక, నీచిత్తమును ధర్మపథమునందు వర్తింపఁజేసితివేని, నీకు మిత్రుఁడనై యుందును'' అనిచెప్పిన విని శార్దూలం బందుకు సమ్మతించెను. నాటినుండియు నక్క పులికిఁ దానెఱింగిన తెఱంగున బుద్ధులు సెప్పుచు దాని నికేతనము నందే వసించుచుండెను. ఇట్లు కొంత కాలము గడవ, శార్దూలముయొక్క భృత్యులును- హితులును - గోమాయువు స్నేహ మధికముగా నున్నదని యసూయవహించి యయ్యిరువురి సఖ్యమును జెఱుపఁదలంచి, యాపులి యాహారము నకై దాచుకొన్న మాంసము నపహరించిరి. ఆ దినమున నాహారపదార్ధ రక్షణము సేయుట గోమాయువు వంతు గావున నయ్యది మాంసమును గానక, యెవ్వరో తస్కరించి యుందురని తలంచి, యావృత్తాంతమును బులి కెఱింగించెను.

అంత నా శార్దూలము మాంసమును హరించిన వారెవ్వరో యరయఁ దలచియుండఁ గపటహితులు దమ ప్రభువును సమీపించి రహస్యముగ నిట్లు పలికిరి. 'ఈ గోమాయువున కిది యేమివ్రతము? ఇది యంతయు డాంబికము. నక్కయట! మాంసముఁ దినదఁట! ఈ వాక్యము లెవ్వరయిన విన్న నవ్వుదురు. కపటములకు నక్క పుట్టిల్లు. ఆమాంసమదియు భుజించి యేమియు నెఱుంగని దానివలెనున్నది. ఇది యంతయు మీతోఁ జెప్పినచో నేమి యాగ్రహము గలుగునో యని సంశయించి యూరకుంటిమి. ఇఁక మీచిత్తము.''

ఈ తెఱంగునఁ గపటస్నేహితులు వచించిన వాక్యములు విని శార్దూల మాగ్రహాయత్తచిత్తమున నాజంబుకంబును బట్టి బంధించి చంపుఁడని సహచరుల కాజ్ఞయిచ్చెను. ఇంతలో శార్దూలముయొక్క తల్లివచ్చి కుమారున కిట్లనెను. "నాయనా! కుటిలమతులగు హితులమాటల నాలించి నక్కకు హానిఁగలుగఁజేయనెంచితివి. బుద్ధిమంతులను జూచి, దుర్బుద్ధిపరులును, నధికులఁజూచి హీనులును, రూపవంతులను జూచి కురూపులును, సామాన్యముగా నసూయపడుదురు. ఒక్కొక్క సమయమున ధర్మ మధర్మముగాను, అధర్మము ధర్మముగాను, దోచుచుండును. దానిని నిర్మల హృదయముతో నరయవలయును. జంబుకము నిన్నుఁ జేరి నప్పటినుండియు, నీకెన్నియో హితంబు లుపదేశించివదే?

వానిని నీవు పాటింపవలదా? ఆగోమాయు వెట్టి దుష్కృత్యమును సేయునదికాదు'' అని తల్లి పలికిన మాటలు విని యాశార్దూలము పశ్చాత్తాపము నంది నక్కను బిలువఁబంచి గౌరవించెను. అప్పుడా జంబుకము వ్యాఘ్రమును విలోకించి "ఓపులీ! పూర్వము నీవు చేసిన శపథమును మఱచి కుటిల హృదయుల మాటల నాలించి నాకెగ్గొనరింపఁ దలంచితివి. ఎట్టిగియో యెఱుంగకో యొకనిని భంగపఱిచి మఱలవానిం బ్రసన్నుని జేసికొనుట మంచిదికాదు.'' అని పలికి, యచ్చోటువాసి మఱియొక ప్రదేశమునకుఁబోయి నిరశన దీక్షం బూని ముక్తిఁగాంచెను,



# 7 కృష్ణుఁడు

## 'ప్రాణమిత్రుల కెపుడు తోడ్పడఁగవలయు

పూర్వము కుచేలుఁడను భూసురుఁడు గలఁడు. ఈతఁడును గృష్ణుఁడును సాందీపుఁడను గురువునొద్ద విద్య నభ్యసించిరి. విద్యాభ్యాసకాలమున వారిరువురు నొకరి నొక రెడఁబాయక మిగుల మైత్రిఁ గలిగియుండిరి. విద్యాభ్యాసము పూర్తియైన పిమ్మట వారు తమ తమ నివాసములకుఁ బోయిరి. కుచేలుఁడు తన యిల్లుసేరి వివాహము సేసికొని, పెక్కండ్రు పుత్రులఁబడసెను. ఆతఁడు మిగుల దరిద్రుఁడు. కుటుంబ రక్షణమున కాతఁడు పెక్కుకష్టములఁ బొందుచుండెను. ఆతని భార్య మహాపతివ్రత. ఇంత దారిద్ర్యములో మునిఁగియున్నను నామె భర్తృసేవను మఱవలేదు. కుచేలుఁ డెప్పుడును శ్రీహరి సేవఁజేయుచుఁ గాలముగడపుచుండెను. ఎవ్వరైనఁ దన కేమయినఁ దెచ్చి యిచ్చిన దానిం బుచ్చుకొని కుటుంబమును బోషించుచుండెనుగాని, యెన్నఁడును బర గృహముల కేగి యాచింపక యుండెను.

"ఇదియడుగవచ్చును. అది యడుగఁగూడ"దను విషయము పిల్లలకుఁ దెలియదు. ఇరుగు పొరుగువారి పిల్లలు మంచి వస్త్రములఁ గట్టుకొనుచుండుటయు, నేదో తినుచుం

డుటయుఁజూచి, తమకుఁగూడ నట్టివి తెచ్చి యిమ్మని కుచేలుని కొడుకులు తల్లి నడుగసాగిరి. ‹పాపము! ఆసాధ్వి మణి యేమిసేయఁగలదు? ఇట్లనేక దినములు గడచిపోయెను. ఒకనాఁడు భార్య కుచేలుంగాంచి ‹మీరు భగవద్భక్తులగు టచే నెప్పుడును నానందముగనే యుందురు. మన దారి ద్ర్యమునుగూర్చి కొంచెమైనను విచారింపక యున్నారు. ఏదయిన మార్గముఁ జూచినఁగాని బ్రిదుకఁజాలము. ద్వా రకా పురాధీశుఁడగు కృష్ణుఁడు మీకు బాల్యస్నేహితుఁడని పెక్కుమారులు సెప్పియున్నారు. అతఁడు మహాభాగ్యవం తుఁడు. మీ రాతని యొద్దకుఁ బోయినచో నేమయిన నొసంగక యుండునా? '' యని చెప్పెను. ఆమాటలు విని కుచేలుఁడు కృష్ణునిఁ జూడఁబోవుటకు సమ్మతించెను. కాని రిక్తహస్తములతో నా మహనీయునెట్లు సూతునా యని విచారించి యామాట గృహిణికిఁ దెలిపెను. అప్పుడామె యింటనున్న యటుకులు కొన్ని తన మగనిజీర్ణవసనమునకుఁ గట్టి వానిని గృష్ణున కిమ్మని చెప్పెను.

కుచేలుఁడు బయలుదేరి హరిని స్మరించుకొనుచు, దినదిన ప్రయాణముల ద్వారకాపురమును జేరెను. అచ్చటి జనులవలనఁదోవఁగనుఁగొని, యాతఁడుకృష్ణునిమందిరమును జేరి,యచ్చటనున్న ద్వారపాలకుల వలనఁదనరాకఁగృష్ణునకుఁ దెలియఁజేసెను. వెంటనేకృష్ణుఁడుతల్పముడిగ్గి,కుచేలునకెదురు

వచ్చి, నమస్కరించి తోడ్కొనిపోయి, తన తల్పమునందే యాసీనుం జేసి బహువిధములఁ బూజించి కుశల ప్రశ్న యొనర్చెను. కుచేలునకుఁ బతియానతి ననుసరించి రుక్మిణి సురటితో వీవఁదొడంగెను. అది యంతయుఁజూచి యంతః పుర పరిచారిక లాశ్చర్యమును బొందిరి. కృష్ణుఁడు కుచేలునిఁ గాంచి "నాకొఱకేమి కానుకఁదెచ్చితి" వని యడిగెను. కుచేలుఁడు తన జీర్ణవస్త్రమునకుఁ గట్టఁబడియున్న యటుకుల నిచ్చుటకు సిగ్గుపడి యూరకుండెను. కాని, కృష్ణుఁడది గ్రహించి తానే యామూటను విప్పుకొని, పిడికెడటుకులు నోటవేసికొని, మఱొక పిడికెడటుకులు భుజింపఁదలంచెను. అప్పుడు రుక్మిణి కృష్ణుని హస్తమును బట్టుకొని, "దేవా! జగన్నాథా! ఈ కుచేలుని మహదైశ్వర్యవంతునిఁగాఁ జేయుట కివి చాలు"నని వారించెను. తరువాతఁ గుచేలునకు షడ్రసోపేతముగాఁ గృష్ణుఁడు విందుఁజేసి, యమూల్యవస్త్రాభరణాదు లొసంగి పంపెను. కుచేలుఁ డింటికి వచ్చుసరికి, అంతకు ముందు తానున్న జీర్ణకుటీరము మహాసౌధమై యుండెను. ఎక్కడఁ జూచినను రత్నరాసులే. ఆతని భార్య యెదురువచ్చి యాతనిని లోనికిఁ దోడ్కొని పోయెను. ఈ వైభవమంతయుఁ గృష్ణుని యనుగ్రహము వలనఁ గలిగెనని కుచేలుఁడు సంతసించి తొల్లింటికంటె నెక్కుడు శ్రీహరిని భజించుచుఁ గాలము గడుపసాగెను.

# 8 గోవర్ధనోద్ధారణము

'పెద్దలగు వారితోఁ బగ - పెట్టుకొనినఁ
దనకె యవమానమై తీరుఁ - దప్పకుండ,'

శ్రీకృష్ణుఁడు దేవకీ వసుదేవులకుఁ దనయుఁడై వ్రేపల్లె యందు యశోదానందులచేఁ బెంపఁబడెను. బాల్యమునందే కృష్ణుఁ డద్భుతకార్యము లనేకములు సేయుటచేత నాతఁడు భగవంతుఁడని గోపకులును దక్కినవారును దలంచిరి. గోపకులు సాధారణముగాఁ బ్రతి సంవత్సరమును బంటలు బాగుగాఁ బండుటకును - వర్షములు చక్కగాఁ గురియుటకును, బశువులకు రోగములు సంభవింపక యుండుటకును, ఇంద్రయాగమను పేర నొక మహోత్సవము సేయుచుందురు. అట్లే యొక సంవత్సరము నందుఁడా యుత్సవమును జేయింపఁ దలంచెను. అప్పుడు కృష్ణుఁడు నందునిఁజూచి "తండ్రీ! ఇంద్రునకు మీ రేల యుత్సవము సేయవలయును? ఆతని యనుగ్రహము లేనిచో వర్షములు గురియవా? పంటలు పండవా? ఆతనిని మీరు పూజింపవలదు. ఇంద్రయాగమునకు సిద్ధముసేసిన వస్తుసమితితో గిరినిఁబూజింపుఁడు" అని చెప్పెను. కృష్ణుని మాటలు విని నందాది గోపకులుగోబృందముతో గోవర్ధనగిరిం బూజించి మహోత్సవమును జేసిరి.

శ్రీకృష్ణుఁడు వారించుటచేతఁ దన కుత్సవము సేయ
లేదను కోపమున నింద్రుఁడు గోపకులకుఁ బరాభవము
సేయఁదలఁచి, మేఘములఁ బిలిచి "మీరు గోకులంబును
వర్షముతో ముంచి వేయుఁ"డని వచించెను. అంతట వర్ష
మారంభమయ్యెను. క్రమక్రమముగా నది యధికమయ్యెను.
మెఱుపులు - ఉఱుములు, పిడుగులు, బయలుదేరెను. జగ
మంతయు నంధకారముచే నావరింపఁబడెను. ఆ వర్షమున
కిఁకఁ దాళఁ దఱును జాననలసినవారే యని గోపకులందఱును
బిగులువడి యిటు నటుఁ బరుగులెత్తుచుఁ గృష్ణునిఁజూచి
"రక్షింపుము రక్షింపు"మని మొఱపెట్ట సాగిరి. కృష్ణుఁడిది
యంతయు మహేంద్రుఁడొనర్చిన కృత్యమని గ్రహించి గోప
కులఁజూచి "గోపకులారా! మీరావంతయు భయమంద
వలదు. నే నీ గోవర్ధన పర్వత మెత్తెదను. మీ రందఱును
గోవులతోఁగూడ దీని క్రిందికి రండు. బాలుఁ డీ కొండ
నెట్లెత్తునని సంశయింపవలదు." అని పలికి, యొంతఁ డొక
పూగుత్తి చందమునఁ బర్వతము నెత్తి గొడుగువలె నిలిపెను.
గోపకులందఱును గోవులతో దాని క్రిందఁ జేరి, భయము
వాసి కృష్ణుని సామర్థ్యమును బ్రశంసించిరి. ఏడు దినములు
వర్షము గురిసినను, గోపకులు ఆకలి దప్పులెఱుంగక వాసు
దేవుని దయవలన సుఖముగా నుండిరి. ఇది యంతయు

నెటింగి యిందు్రుడు సిగ్గుపడి కృష్ణుని సన్నిధికివచ్చి తా నొనర్చిన యపరాధమును మన్నింపుమని కోరెను.



# 9 సురథుఁడు

"వీరులగువారు పూజ్యులై - వెలయుచుంద్రు"

సురథుఁడు చంపకా పురాధీశ్వరుఁడైన హంసధ్వజు నకుఁ బుత్రుఁడు. మహాశౌర్యధనుఁడు. బలపరాక్రమ సంపన్నుఁడు. శ్రీహరికి భక్తుఁడు. భారతయుద్ధానంతరమున ధర్మరాజు అశ్వమేధయాగము సేయుటకుఁ బ్రారంభించి యశ్వమును ధరాచక్రమెల్లఁ దిరిగిరా విడిచెను. దాని కంగరక్షకులుగాఁ గృష్ణార్జునులు మొదలగువారేగిరి. ఆ యశ్వము చంపకాపుర సమీపమున హంసధ్వజునిచే బంధింపఁబడెను. ఇందులకై హంసధ్వజునకును - నర్జునునకును బోరాటము సంభవించెను. అందు హంసధ్వజుని రెండవకుమారుఁడగు సుధన్వుఁడు పార్థునిచే నేలఁగూలెను. ఈ వార్త నాలించి సురథుఁడు రణభూమికి వచ్చెను. ఆతని శౌర్యపరాక్రమము లకుఁ దాళఁజాలక పాండవబలములు పఱుగిడఁ దొడంగెను. తుదకు ధైర్యము వహించి యర్జునుండాతని నెదుర్కొనెను.

ఇరువురకు భయంకరమైన యుద్ధముజరిగెను. ఎట్టకేల కర్జునుఁడు తీవ్రశరప్రయోగమున సురథునిశిరము నేలఁగూల్చెను.

అప్పు డర్జునుని ప్రక్కనున్న కృష్ణుఁడు సురథుని శిరము నేలఁబడకుండఁ దనచేతితోఁ బట్టికొని, గరుత్మంతునిఁ బిలిచి "వైనతేయా! నీ వీ సురథుని శిరముఁ గొని పోయి ప్రయాగఁగల గంగావాహినియందుఁ బడవైచి రమ్ము" అని యాజ్ఞాపించెను. భగవానుఁడగు కృష్ణుని యాజ్ఞ ననుసరించి గరుత్మంతుఁడు సురథుని శిరముఁ గొని యాకాశవీథిం బోవుచుండ, వృషభవాహనారూఢుఁడై పరమేశ్వరుఁ డా మార్గమునఁ బోవుచు భృంగిరిటిని విలోకించి "సురథుని శిరమును గంగలోవైవ గరుత్మంతుఁడు గొనిపోవుచున్నాఁడు. నీవరిగి యాశిరమును నాకడకుఁదె"మ్మని తెల్పెను. సురథుని శిరమునకై గరుడునకును భృంగిరిటికిని గయ్యమయ్యెను. ఇట్లిరువురును బోరు నవసరమువ సురథుని శిరము ప్రయాగ జలములందుఁబడెను. అనంతరము భృంగిరిటి యాశిరమును గొనిపోయి శివునకర్పించెను. పరమేశ్వరుఁడా సురథుని శిరమును దన కపాలమాలికామధ్యమున నాయకమణిగాఁ జేసికొనెను.

"శూరులు - ధర్మచరిత్రులు - విజితేంద్రియులు - మొదలగు వారి శిరములు పరమేశ్వరుఁడు హారములుగా ధరించును.

# 10 వసువులు

"దోసములలోనఁ బెద్దది - దొంగతనము
సేయఁగూడదు చేసినఁ - జేటుగలుగు"

వసిష్ఠుఁడను మునీంద్రుఁడు తపమువలన నద్వితీయమైన మహిమ నార్జించి బ్రహ్మర్షి యయ్యెను. ఆతనియొద్ద "నందిని" యను పేరుగల కామధేను వుండెను. ఆకామధేనువు వసిష్ఠుఁడు కోరిన ప్రతిపదార్థమును సమకూర్చుచుండును. ఆకారణమున వసిష్ఠుఁడు తన యాశ్రమమున కెంతమంది యతిథులు వచ్చినను విందు సేయుచుండును. ఒకనాఁడు "వసువు" లను దేవతలు వసిష్ఠుని యాశ్రమ సమీపమునకు విహారార్థమై వచ్చిరి. తన యాశ్రమ సమీపమున కెవ్వరైన వచ్చినచో వారిని విందునకుఁ బిలుచుట వసిష్ఠున కాచారము. వసువు లరుదెంచుట యాతఁడు చూచి, వారిని దన యాశ్రమమున విందుఁ గుడిచి పొమ్మని యడిగెను. వసువు లందుకు సమ్మతించిరి. విందు గుడుచునప్పుడు కావలసిన పదార్థములు కామధేనువు సమకూర్చుట వారు చూచి, మిగుల నాశ్చర్యమును బొందిరి. అందులోఁ జిన్నవాఁడగు వసువు భార్య మగనిం గాంచి "మన కెంత భాగ్యమున్నను నేమిలాభము? ఒక్క కాసైనఁ జేత లేకుండ మన కీముని విందు సేసినాఁడు. ఇందుకుఁ గారణము కామధేనువేగదా?

నంతటి సామర్థ్య ముండునా!'' యని తలంచి, పన్నగమును విలోకించి "నేను పాండుపుత్త్రుఁడ-భీముఁడనువాఁడ. నన్ను బంధింపఁజాలిన సామర్థ్యము నీకెట్లు కలిగెను?'' అని ప్రశ్నించిన నయ్యజగరము భీముంగాంచి యిట్లు పలికెను- ''ఈ బలము నాకు వరమునఁ గలిగినది. ఎంతటి బలశాలురైనను నాకుఁ జిక్కి- బలహీనులగుదురు. నేఁడు నీవు నాకాహారంబవైతివి. ఇంద్రపదవి నంది బ్రాహ్మణుల కవమానము సేసిన కారణమున నిట్లు శాపగ్రస్తుఁడ నైతి'' నని పలికెను. భీముం డాసర్పమును జూచి ''నేను నీకాహారమగుచుంటినని చింతింపను, కాని నన్నుఁ గానక నాసోదరు లెంత వగతురోయని విచారించెద' నని నుడివెను. అంతలో వేఁటకరిగిన భీముఁడు వచ్చుటకుఁ దడవయ్యెనని యాతని జాడ నరయుచు వచ్చి పన్నగముచేఁ బట్టువడియున్న భీమునిఁ జూచి ధర్మనందనుఁడు మిగుల వగచి, యయ్యజగరమును జూచి యిట్లనెను. ''నేను పాండవాగ్రజుఁడ. ధర్మనందనుఁడ. ఈతఁడు నా తమ్ముఁడగు భీముఁడు. నీవాహారము నిమిత్తమై యీతనిని బంధించితివని తోఁచుచున్నది. కావున నీకు వలసినంత మృగమాంస మిచ్చెద. ఈతనిని విడువుము''

యుధిష్ఠిరునకు సర్ప మిట్లనెను. "ధర్మనందనా! నేను పూర్వులకంటెఁ బూర్వుఁడను. నహుషనామధేయుఁడ.

అమరనాథ పదమునొంది, యైశ్వర్య గర్వమున బ్రాహ్మ ణుల కవమానము సేసిన కారణమున శాపమునంది యిట్లు యితిని. మునీంద్రుల యనుగ్రహమునఁ బూర్వజ్ఞానము గలిగి యుంటిని. నీప్రశ్నముల కెవ్వఁ డుత్తర మొసంగునో యప్పుడు నీకు శాపవిముక్తి యగునని ఋషులు సెప్పియుం డిరి. ఇప్పుడు నీతమ్ముఁడు నాచేత బంధింపఁబడినాఁడు. చేతనగునేని నాప్రశ్నముల కుత్తరము లిచ్చి యీతనిని విడిపించుకొనుము."

ధర్మజుం డందుకుఁ దాను నేర్చిన విధమునఁ జెప్పెద నని చెప్పెను. అంతట నహుషుఁడు కొన్ని ప్రశ్నలు వేయ యుధిష్ఠిరుఁడు వానికి సదుత్తరము లిచ్చెను. నహుషుఁడు ధర్మజుని ప్రత్యుత్తరములకు సంతసించి, భీముని విడిచి, తాను గూడ శాపవిముక్తి నందెను.



# 12 త్రిశంకుఁడు

'గురుతిరస్కార మెవరికిఁ - గూడదరయ'

తొల్లి యిక్ష్వాకు వంశమునఁ ద్రిశంకుఁడను నొక భూపాలుఁడు గలఁడు. అయోధ్యానగర మాతని రాజధాని. వసిష్ఠుఁడను బ్రహ్మర్షి యాతనికి గురుఁడైయుండెను. త్రిశంకుఁడు పెక్కుదానములును, గ్రతువులును జేసెను. సత్యవ్రతమే యాతనికిఁ బరమభూషణము. ఆతనికి బొందితో స్వర్గమునకుఁ బోవుటకు వాంఛజనించెను. వెంటనే యాతఁడు తన గురువయిన వసిష్ఠునిరావించి. "గురువర్యా! నాకు బొందితో స్వర్గమునకుఁ బోవలయునని కోరిక గలిగినది. నీవు మహామహిమగలవాఁడవు. నీవు నాయందుఁ గరుణ చూపితివేని, నేను సఫలీకృత మనోరథుఁడ నగుదును. కావున నా కోరికదీర్చుటకుఁ బ్రియత్నింపు''మని వినయపూర్వకముగఁ బలికెను. అందుకు వసిష్ఠుఁడా రాజుంజూచి "ఇయ్యది సాధ్యమయిన పనికాదు. ఎంత ప్రియత్నించినను లాభము లేదు. కావున నీవా కోరిక విడచుట మంచి"దని చెప్పెను. త్రిశంకుఁడా మాటల సటుకుఁగొనక వసిష్ఠుని పుత్రులఁజేరి యడిగెను. వారుగూడఁ దమ తండ్రి చెప్పిన యట్లే చెప్పిరి. అందుకుఁ ద్రిశంకుఁడా గ్రిహామువహించి వారిని దూషించెను. వసిష్ఠుని పుత్రులు త్రిశంకునిపై నలిగి ఛండాలుఁడవు

గమ్మని శపించిరి. అట్లు శపింపఁబడియుఁ బొందితో స్వర్గమునకుఁ బోవలయునన్న కోరికను మాత్రి మతఁడు విడువ లేదు. తరువాత నాతఁడు వసిష్ఠునకు విరోధియైన విశ్వామిత్రుని యొద్దకుఁబోయి తన కోరికఁ దెలిపెను. "నేను నిన్ను బొందితో స్వర్గమునకుఁ బంపెద"నని చెప్పి, విశ్వామిత్రుఁడా త్రిశంకునిచే నొక గొప్పయాగము సేయించెను. యాగము పూర్తియైన పిదప విశ్వామిత్రుఁడు తన మహిమచేతఁ ద్రిశంకుని స్వర్గమునకుఁబంపెను. కాని దేవతలందఱును "నీవు ఛండాలుఁడవు. స్వర్గమునకు వచ్చుట కర్హుఁడవుగావు"అని పలికి క్రిందికిఁ బడద్రోసిరి. అప్పుడు త్రిశంకుఁడు, 'రక్షింపుము. రక్షింపు' మని విశ్వామిత్రుని వేడికొనెను. విశ్వామిత్రుఁడు జాలినొంది, యా త్రిశంకుఁడు నేలఁ బడకుండ మార్గమధ్యమందే నిలిపి దానికిఁ ద్రిశంకు స్వర్గమని పేరుబెట్టెను. గురుని యానతి మీరినందు కాత్రిశంకుఁడు స్వర్గమును బొందక, భూమియందు నుండక మధ్య నూగులాడుచుండెను. ఈ కారణముననే మనవా రేయాధారము లేకయున్న వానిని ద్రిశంకు స్వర్గములో నున్నాఁడని సామెతగాఁ బలుకుచుందురు.

## 13 శిబి

" ఓర్పుగలవాఁడె సౌఖ్యంబు - నొందఁగలఁడు"

ఒక సమయమున శిబియను చక్రవర్తికడకు బ్రహ్మ బ్రాహ్మణవేషమున వచ్చెను. శిబి యాతనిని భక్తిపూర్వకముగా ననేకవిధములఁ బూజించి "మహాత్మా! మీకేమి కావలయును. కోరుఁడు మీయభీష్టమెట్టిదయిననుఁ దీర్చెద" నని పలికెను. అందుకా కపట భూసురుఁడు చక్రవర్తిని జూచి 'నీకుమారునివధించి యామాంసముతో నాకు విందు సేయు'మని యడిగెను. అందుకు శిబియెంత మాత్రమయినను విచారమందక, యాబ్రాహ్మణుఁడు కోరిన విధమునం దన కుమారునిఁజంపి, యామాంసమును వండించి, యాతనిఁ బిలుచుటకు వచ్చెను. బ్రాహ్మణుఁడు మాయమయ్యెను. అతిథి కనఁబడక పోయినందుకు విచారమందుచు నతనిని వెదకుటకు భోజనపదార్థములతో బయలుదేరెను. నృపాలుఁ డతిథిని వెదకుచుండ నొక భటుఁడువచ్చి "రాజా! నీవెవ్వరి నిమిత్తము వెదకుచున్నావో,ఆబ్రాహ్మణుఁడు నీమందిరమున నున్న యమూల్యములయిన వస్త్రముల నన్నింటిని దగుల వేయుచున్నాఁడని పలికెను. శిబి కడురయమున గృహాము నకుఁ బోయి యాబ్రాహ్మణునిఁ గాంచి యాతని ముందు భోజనపదార్థము లన్నియుఁ బెట్టి "స్వామీ! మీకొఱకే

వెదకుచుంటిని. తాము కోరిన చందమున, జేయించితిని. కరుణించి భుజింపుఁ" డని విన్నవించెను. ఆ బ్రాహ్మణుఁడు "రాజా! నీవు భుజింపుము. అట్లు చేసితివేని నాకు సంతృప్తి యొదవు" నని చెప్ప నాతని యాజ్ఞననుసరించి, శిబి యా పదార్థమును దినుటకు సంసిద్ధుఁడయ్యెను. అప్పుడా బ్రాహ్మణుఁడు నిజరూపమును దాల్చి "రాజేంద్రా! నీయోర్పుఁ బరీక్షించుటకు వచ్చిన చతుర్ముఖుఁడఁ గాని బ్రాహ్మణుఁడఁ గాను. నీగుణమునకు సంతసించితి" నని పొగడి యదృశ్యుఁ డయ్యెను. శిబి కుమారుఁ డప్పటివలె నాడుకొనుచుండెను.



# 14 ధర్మరాజు

"తన్నుఁ జూచినట్లు – దగ భూతకోటిని
జూడవలయు దయయుఁ – జూపవలయు !

ధర్మరాజు తన మనుమఁడగు పరీక్షితునకు హస్తినాపుర సామ్రాజ్యాభిషేకముఁ జేసి, తమ్ములతో స్వర్గమునకుఁ బోవునప్పు డాతని నొక కుక్క వెంబడించెను. మార్గమధ్యమున ద్రౌపదీ భీమార్జున నకుల సహదేవులు మరణించిరి. ధర్మరా జొక్కఁడు మాత్రమే పోవుచుండెను. కుక్క మాత్ర మాతనిని విడువక వెంటనే యరుగుచుండెను. అప్పు డింద్రుఁడు దివ్యమైన రథమును దీసికొని వచ్చి "ధర్మరాజా! నీవు ధర్మసంధుఁడవు. మహాపుణ్యకార్యములఁ జేసితివి. స్వర్గమును బొందుట కర్హుఁడవు, కావున నీవీరథమెక్కి స్వర్గమునకు ర"మ్మని పలికెను. ధర్మరాజంత దేవేంద్రునిఁ జూచి "మహేంద్రా! నీవు నాకుఁ జూపనున్న గౌరవమున కెంతయు సంతసించితిని. కాని యొక్క విషయము మాత్రము నీతోఁ జెప్పవలసి యున్నది. నేను పురమునుండి బయలుదేరి నప్పటినుండియు, నీశునకము గూడ నావెనువెంట వచ్చుచున్నది. కావున దీనిని ముందు రథమెక్కనిమ్ము. తరువాత నే నెక్కెద" నని చెప్పెను. ఆమాటలు విని యింద్రుఁడు నవ్వుచు "ధర్మరాజా! నీమాటలకు నవ్వువచ్చుచున్నది.

కుక్క యేమి, ఈరథముపై నెక్కి స్వర్గమునకు వచ్చుటేమి? ఎవ్వరైన ఈమాట విన్నఁ బరిహాసము సేయరా? కుక్కను గూడ స్వర్గమున నిలుపనెంచితివా?" యని పలికెను అందుకు ధర్మరా జిట్లనెను. "దేవేంద్రా! నీవు సమస్త ధర్మ సంవేదివి. నేను నీకుఁ జెప్పఁదగిన సమర్థుఁడఁ గాను. ఎప్పుడును నేను నీకరుణఁ గోరియున్నవాఁడనే. పాపము! ఈశునకము మొదటినుండియు నావెంట వచ్చుచున్నది. ఇట్టిదానిని విడిచి వచ్చుటకు నాచిత్త మెట్లు సమ్మతించును? నేను దానిని మాత్రము విడువఁజాల" ననెను, ఆపలుకులు విని దేవేంద్రుఁడు "శునక మతినీచమయిన జంతువు. దానిని ముట్టుకొనరాదు. రాజులు మాత్రము వేఁటసమయములోఁ దాకుచుందురు. కుక్కను స్వర్గమునకుఁ దీసికొని పొమ్మని కొంచెమయినను నాలోచింపక పలికితివి." అని వచింప ధర్మరాజం డిట్లనెను. "శచీకళత్రా! నే నాలోచించియే యిట్లు చెప్పితిని. ధర్మపరు లాశ్రితుల విడువరు. ఆశ్రితరక్షణము కన్న మఱియొక పుణ్యకార్యము లేదు. ఈశునకము నన్నాశ్రయించుకొని వచ్చుచున్నది. దీనిని విడిచి నేను స్వర్గమున కెట్లు వచ్చెదను? ఈ కుక్కను విడిచినఁగాని నాకు స్వర్గము రాదని నీవు చెప్పితివేని నాకు స్వర్గమే యక్కఱ లేదు-" అందు కింద్రుఁడు "ధర్మరాజా! కుక్కకొఱకు నీవు

స్వర్గ మక్కఱ లేదని పలుకుచుంటివి. అయ్యయ్యో! ఇట్టి వెఱ్ఱివాఁ డెందైనఁ గలఁడా? నీ విట్లు వచ్చునప్పుడు దారిలో నీభార్యను దమ్ములను విడువలేదా? ఇంత యవివేకివగు చుంటివేమి?'' యనెను. అందుకు ధర్మరాజు "సురనాథా! నీకంటె నేనెక్కుడు ధర్మములు తెలిసినవాఁడఁ గాను – కాని నీమాటలకు బదులు చెప్పక తప్పదయ్యెను. నాతమ్ములను భార్యను నేను విడువలేదు – బ్రహ్మ వారికిచ్చిన యాయువు తీరినది. చచ్చినవారికిని – బ్రతికియున్నవారికిని సంబంధ మేమియున్నది? ఈశునకము ప్రాణములతో నుండి నావెంట వచ్చుచున్నది. అట్టిచో దీనిని నేనెట్లు విడువఁగలను? అట్లు సేయుట ధర్మవిరుద్ధము. నీకు నాయందు దయయున్నచో నీసారమేయమును గూడ స్వర్గమునకు రానిమ్ము'' అని గంభీరముగఁ బలికెను.

అప్పుడు శునకరూపమును బాసి యముఁడు ధర్మ రాజునకుఁ బ్రత్యక్షమై 'ధర్మరాజా! నీధర్మబుద్ధికి నేను సంత సించితిని. నీ చిత్తమును బరిశోధించుటకే యిట్టి రూపమును దాల్చి నీవు పురమునుండి బయలు దేరినప్పటి నుండియు నీవెనువెంట వచ్చితి'నని పలికి యింద్రుని రథముపై నాతని నెక్కించుకొని స్వర్గమునకుఁ దీసికొనిపోయెను.



# 15 చిరకారి

‘ వినఁదగు నే పనిఁజెప్పిన
వినినంతనె వేగపడక - వివరింపవలెన్ ’

ఒకసమయమున నొక మునీంద్రుఁ డాతని పుత్రుఁడగు చిరకారినిఁ బిలిచి, యేదో కారణముపై నతని తల్లినిఁజంపుమని యాజ్ఞయిచ్చి, యెచ్చటికో యరిగెను. ఏపని సేయవలసి వచ్చినను ముందుగ దానింగూర్చి చక్కఁగ విచారించియే చేయునట్టి యాచిరకారి తండ్రియాజ్ఞను గూర్చి పరిపరివిధంబులఁ దలంచి “ఇప్పుడు నాతండ్రి, నాతల్లిని జంపవలసినదని యాజ్ఞాపించినాఁడు. నే నేమి సేయుదును ? తండ్రి యాజ్ఞ మీఱుట మహాపాపము. తల్లిని వధించుట యంతకంటెను బాపము. పోనిమ్ము. తల్లినిఁజంపకుందునేని తండ్రియాజ్ఞను మీఱినవాఁడ నగుదును. ఇటు మాతృవధ - అటు పితృవాక్యతిరస్కారము. ఈ రెండును బాపకార్యములే. ఇరువురును నాకుఁ గావలసినవారలే. ఇందులో నే నెవ్వరిని విడువఁగలను? పితృవాక్యపరిపాలనము కుమారునకుఁ బరమధర్మము. అయ్యది సమస్తసంపదల నిచ్చును. అది సర్వజనసన్ముతము. ఆనందదాయకము. తండ్రియే పరమగురుఁడు. అతఁడే దైవము. తండ్రి కా నందమునుగూర్చు కార్యమును గుమారుఁడు సేసెనేని, వానిని బృందారకులుగూడ మెత్తురు.

అయ్యో! తల్లిమాత్రము విడువఁదగినదియా? ఈతనువు నకుఁ గారణము తల్లి. కుమారుని విషయమై యెక్కువ కష్ట ములను దల్లియే పొందును- మాతృప్రేమయే యీప్రపంచ సృష్టికిఁగారణము. మాతృవియోగి, యేపనిసేయుటకును సమర్థుఁడుగాడు. వానికి జగమంతయు నంధకారబంధురము. భాగ్యవంతునికైనను, నిరుపేదకయినను - మూఢునకైనను, జ్ఞానికయినను మాతృప్రేమ సమానముగనే యుండును. మాతృప్రేమ యనునది తుదకుఁ గలకు కసాయి వానికయి నను దెలియును. ఇట్టి తల్లిని వధించుటకు నాచేతులెట్లా డును?'' అని మనంబునఁ బెక్కుభంగుల విచారించెను.

ఇట్లా చిరకారి తండ్రి యాజ్ఞఁబాలించుటకు దీర్ఘాలో చనము సేయుటవలనఁ గొంతకాలము జరిగి పోయెను. ఇంతలో నాతని తండ్రి దూరము విచారించి 'అక్కటా! మహాక్రూరకార్యము సేయుమని నా కొడుకు నాజ్ఞాపించి యిట్లువచ్చితినే? కుమారుఁడు తల్లినిఁ జంపియుండునేమో? అయినను చిరకారి నామధేయుఁడగు నాతఁడట్టి కార్యము నేనియు దీర్ఘాలోచనము సేసిగాని మఱి సేయఁడు." అని తలంచుచు నిజాశ్రమమునకువచ్చి యెదుట నిలిచియున్న కుమారునిఁజూచి, యంతవఱకుఁ దల్లినిఁజంపకయున్నందుకు సంతసించి యతని కిట్లనియెను. "కుమారా! మహాపుణ్య

శీలుఁడవగు నీవు నాగర్భమున జనించితివి. నీపుట్టువుచే నేను గృతార్థుఁడ నైతిని. నీ తల్లిని వధించుటకు నేనిచ్చిన యాజ్ఞం గూర్చి దీర్ఘాలోచనముఁ జేసి నాకెంతయు మేలు గూర్చితివి. నాకుఁ బాపమురాకుండునట్లును, నింద యొదవకుండునట్లును, నీచేసిన దీర్ఘాలోచనము సమస్తదేవతలచేతను సన్నుతింపఁ బడుఁగాక!". చిరకారియుఁ దండ్రిమాటలు విని సంతసించి, యాతనికి నమస్కరించెను. మునిపత్నియు భర్తకు మ్రొక్కెను. అప్పుడు మునీంద్రుఁడు కుమారునిఁ గౌఁగిలించుకొని యాశీర్వదించెను.

కావున నెట్టిపని సేయవలసి వచ్చినను, దీర్ఘాలోచన మొనర్చి సేయువాఁడు సర్వశుభములఁ బడయును.



# 16 నారదుఁడు

" పాలఁగలియు నీరు - పాలెయై రాజిల్లు
గురునిఁజేరి నరుఁడు - కోవిదుఁడగు
సాధుసజ్జనముల - సాంగత్యమిట్టిది "

దేవునిఁగొలుచుటకుఁ గులగోత్రములతోఁ బనిలేదు. ఏకులము వాఁడైనను భక్తుఁడందఱిచేతను వినుతింపఁబడును. పూర్వకాలమున వేదవాదులను నింటిపేరుగల బ్రాహ్మణు లొక గ్రామమున నివసించుచుండిరి. వారి గృహమున నొక దాసిగలదు. దాని కొక కొడుకు గలఁడు. అతని పేరు నారదుఁడు. ఇట్లుండఁ గొందఱు సన్యాసు లొక నాఁడు వేదవాదుల యింటికివచ్చి యక్కడ నాలుగు మాసము లుండుట తటస్థించినది. ఆ సన్యాసులకు సేవఁజేయుటకు వేదవాదులచే నారదుఁడు నియమింపఁబడెను. నారదుఁడు బాలుఁడైనను సుగుణవంతుఁడు. పెద్దలయందు వినయము - భక్తి - మొదలగు మంచి గుణము లాతనియందు మూర్తీభవించి యుండెను. అందుచేత యోగులును మిగుల సంతోషమును బొందిరి. నారదుఁడును దన్ను వారు మెచ్చునట్లు సేవించుచుండెను. ఇదియుంగాక మునులు తిన్నగా మిగిలిన యన్నముఁ దినుట పుణ్యమని తలంచి, యాతఁ డట్లు సేయుచుండెను.

ఋషు లెప్పుడును భగవన్నామ సంకీర్తనము సేయు చుండుట నారదుఁడు సూచి, తానుగూడ భగవత్కీర్తనము సేయసాగెను. నారదుని భక్తిశ్రద్ధల కామునీశ్వరులు మిగుల సంతసించి యతనికి శ్రీమన్నారాయణుని బూజించు విధముఁ దెలిపి, వేదవాదుల గృహము విడిచి మఱియొక చోటికిఁ బోయిరి. మునులచే బోధనందినప్పటినుండియు, నారదుని చిత్త మదియొకవిధముగ మాఱిపోయెను. అతఁ డెప్పుడును శ్రీహరినిఁ దలఁచుచు వేదవాదుల యింట సేవకుఁడై యుండెను. ఈతనిఁ జూచినఁ దల్లికి మిగుల ప్రేమ యుండెను. బ్రాహ్మణులయింట సేవలుసేసి, యింటికివచ్చిన కుమారుని దల్లి ముద్దాడుచుండును. కాని నారదుఁడు మాత్రము తల్లి ప్రేమ నంతగాఁ బాటింపక యుండెను. ఆతఁడు – తల్లిదండ్రులు– సంపదలు–సౌఖ్యములు – మొదలగునవి యన్నియు నిలుకడ లేనివని గ్రహించెను. ఇట్లుండఁ గొన్నాళ్ళకు నారదుని తల్లి చనిపోయెను. అతఁ డందుకు విచారింపలేదు. అంతయు భగవంతుని యాధీనమని తలంచి ధైర్యమూని, తిన్నగా నరణ్యమునకుఁ బోయెను. అతఁ డెట్లయినను శ్రీహరిని జూడవలెనను పట్టుదలతోఁ దపము సేయసాగెను. ఇట్లనేక వత్సరములు గడచెను. ఒకనాఁ డాతని కన్నుల కొక దివ్యమైన తేజము గనుపించెను. అది చూచుచుండఁ గనే మాయమయ్యెను. ఆతఁడు నలుదిక్కులఁ గలయఁ

జూచెను. నిర్జనంబైన యాయరణ్యమున నాతని కేమియుఁ గనుపించలేదు. "కుమారా! ఈజన్మమున నన్నుఁ జూడఁ జాలవు. మఱియొక జన్మమున నన్నుఁ జూడఁగలవు. మఱియు నాజన్మమున నీవు మహాభక్తుఁడ వగుదువు" అను పలుకు లాతనికి వినవచ్చెను. ఇవి శ్రీహరి పలుకులు. నారదుని భక్తికి సంతసించి, యాతఁ డదృశ్య రూపమున నట్లు పలికెను. ఆవాక్యములకు నారదుఁడు సంతసించి తగిన కాలమున కెదురు సూచుచుండెను. కొంతకాలమున కతఁడు మరణించెను. తరువాత నీతఁడు ప్రపంచసృష్టికి ముందు బ్రహ్మదేవుని దేహాంశమునఁ బుట్టి, సప్తస్వరములు గల వీణెను వాయించుచు - హరినామకీర్తనము సేయుచుఁ, బరమ భక్తుఁడై మూఁడులోకములయందు శంకలేక చరించుచు భక్తాగ్రగణ్యుఁడై యశోజీవి యయ్యెను.



# 17 వృకాసురుఁడు

'హీనులకు మేలుసేసిన - హానిగలుగు'

పూర్వము వృకుండను నొక దైత్యుఁ డుండెను. అతఁడు శివునిఁగూర్చి ఘోరమయిన తపస్సు సేసెను. వాఁడు సేసిన తపమునకు శివుఁడు దర్శనమిచ్చి "నీకేమి వరము కావలయునో కోరుకొను" మని పలికెను. వృకుఁడు పరమేశ్వరునకు నమస్కరించి "స్వామీ! నీవు భక్తుల రక్షించువాఁడవు. ఎట్టి వరములు గావలసిన నిచ్చుచుండువాఁడవు. అందుచే వారు నిన్నుఁ గొల్చి యిష్టకామ్య ఫలంబులఁ బొందుచుందురు. అట్లే నేను నెండ వానల కోర్చి నిన్ను సేవించితిని. నాతపము ఫలించుటచేత నీవు నాకు దర్శనం బొసంగితివి," అని పలికి, "నేనెవని నెత్తిమీదఁ జేయి వెట్టుదునో వాఁడు భస్మమై పోవునట్లు వర" మిమ్మని యడిగెను. ఈశ్వరుఁడు కపటమెఱుంగని మహానుభావుఁడు. కావున, వాఁడు గోరిన వరమిచ్చెను. అంతట నాదైత్యుఁడు శంకరునిఁ జూచి "నీమాట నిజమో యబద్ధమో చూడవలయునుగదా? అందుకు ముందుగ నీనెత్తిపైఁ జేయిపెట్టి చూచెద" నని పలికి యాపనికారము సేయఁబోయెను. దుష్టునకు మేలుసేయఁగాఁ గీడు వెంటనే కలిగెనని శంకరుఁడు

పరుగెత్త సాగెను. వృకుఁ డాతనిని వెంబడించెను. ఇరువు రును జాలదూరము బరుగెత్తిరి. అట్టి సమయమున నిది యంతయుఁ దన దివ్యదృష్టి నెఱింగిన విష్ణుమూర్తి మాయా స్వరూపము ధరించి, శివునిఁ దఱుముకొని పోవుచున్న వృకున కెదురయ్యెను. వృకుఁ డారూపమును జూచి యాశ్చర్యపడి నిలిచి చూచుచుండెను. అప్పుడు విష్ణుమూర్తి వానింజూచి "ఎక్కడ కింత తొందరగాఁ బోవుచుంటివి. కొలఁదికాలము నిలువుము" అని పలికెను. వాడు నిజముసెప్పెను. అంతట శ్రీహరి వానితో "నీవీరీతిగా శివునిఁ బట్టుకొనుటకుఁ బరు గెత్తినచో నాతఁడు చిక్కఁడు. అదిగో! అక్కడ చెఱు వొక్కటి కనుపించుచున్నది. నీవందులో స్నానముసేసి పరిశుభ్రముగాఁ దల దుడుచుకొని శుచివై యాతని నెత్తిపైఁ జేయిపెట్టుము. అట్లు చేసినచో నీకార్యము సఫల మగును. నీవు వచ్చువఱకును నేనిచ్చటనే యుండెద" నని పలికెను. వృకుఁడు హరిమాటల నమ్మి చెరువులో దిగి స్నానము చేసి, తుడుచుకొనుటకుఁ దలపైఁ జేయివైచికొని భస్మమయ్యెను.

సమీపమున నుండి యిది యంతయుఁ జూచుచున్న శివుఁ డప్పుడు శ్రీహరిని సమీపించి "మహాత్మా! నేడు నీమూలమున బ్రతికితిని. నాకొఱకు గదా నీవిట్లు మాఱు

వేషము వేసినావు" అని యనేక విధములఁ బొగడెను. శ్రీహరి శంకరునిఁ జూచి "శంకరా! దుష్టుల కుపకారము చేసినచో నిట్టి సంకటములే వచ్చు" నని పలికి యదృశ్యం జనియెను.

## 18 బ్రాహ్మణపుత్రుడు

'ఎదిరి కెగ్గుఁగూర్చు - నది సత్యమైనను
జెప్పరాదు మునులు - సెప్పిరిట్లు'

ఒక బ్రాహ్మణ కుమారుఁ డొక యడవిలో నొక చిన్న యాశ్రమము గట్టికొని తపస్సు చేయుచుండెను. ఒకనాఁ డాయడవిదారినిఁ గొందఱు స్త్రీపురుషులు సొమ్ముతోఁ బోవుచుండిరి. దారిదోపుడుకాండ్రు వారు పోవుట చూచి, వారిం గొట్టి ధనము లాగుకొనుటకు వచ్చిరి. బాటసారులు భయమంది, పరుగెత్తుకొని పోయి, బ్రాహ్మణకుమారుని యాశ్రమమున కెదురుగానున్న పొదలో దాగుకొనిరి. ఇది యంతయు బ్రాహ్మణకుమారుఁడు చూచుచునే

యుండెను. ఇంతలో బాటసారులను దఱుముకొనుచు వచ్చిన దొంగలు బ్రాహ్మణకుమారుని యాశ్రమమునకు వచ్చి, వారిని వెదకి, కానక, బ్రాహ్మణునిఁ జూచి "అయ్యా! ఇటు కొందఱు బాటసారులు వచ్చినారు. వా రేదారిని బోయిరో నీవెఱుంగుదువా?" యని యడిగిరి. బ్రాహ్మణకుమారునకుఁ దన్ను బాటసారులను గూర్చి యడుగుచున్నవారు దొంగలని తెలియును. అట్లు దెలిసి యుండియు నిజము సెప్పక పోయినచోఁ బాపము వచ్చునని తలంచి, బాటసారు లా పొదలో నున్నారని బ్రాహ్మణుఁడు సెప్పెను. అప్పుడా దొంగలు తొందరగాఁ బోయి పొదలో డాగియున్న బాటసారులను బట్టుకొని, వారిం జంపి సొమ్మంతయు దోచుకొని పోయిరి. బాటసారులు దొంగలచేతఁ జచ్చుటకును, వారి సొత్తంతయుఁ బోవుటకును బ్రాహ్మణుఁడే కారణము. అతఁడు సత్యమే చెప్పినను బరులకుఁ బ్రాణహానిఁ గూర్చినది కావునఁ బాపమే యయ్యెను. ఈ పాపముచేత నాతఁడు ఘోర నరకమునకుఁ బోయెను.



# 19 దక్షుఁడు

"దైవనిందవలనఁ - దప్పదురా కీడు
అజునికైన వాని - యబ్బకైన"

దక్షుఁడను ప్రజాపతికిఁ బార్వతియను కూతురు గలదు. ఆమెను బరమేశ్వరున కిచ్చి వివాహము సేసెను. పరమేశ్వరుఁడు కైలాసపర్వతముపైనుండి భక్తులను రక్షించుచుండును. ఏకారణము చేతనో గాని దక్షుఁ డాతనితో విరోధము పెట్టుకొనెను. అతఁ డెప్పుడును బరమేశ్వరుని నిందించుచుండును. అతఁ డొక గొప్ప యాగము సేయఁ దలంచి దేవతలను, మునులను పిలిచెను. ఈశ్వరుని మాత్రము పిలువలేదు. కాని, తన తండ్రి సేయు యాగమగుటచేత నచ్చటి కరుగవలయునని పార్వతికి మాత్రము గోరిక జనించెను. తండ్రి తన్నుఁ బిలువలేదను చింత మనస్సులో గలదు. ఏమయినను మనస్సు నాపుకొనలేక మగనిని జూచి "దేవా! నాతండ్రి యజ్ఞము సేయుచున్నాఁడు- నేను దానిం జూడఁబోయెదఁ గరుణించి యాజ్ఞ నొసంగు." డని కోరెను. "నీతండ్రి యజ్ఞముఁ జూచుటకు నన్నుఁగాని, నిన్నుఁగాని పిలువలేదు. పిలువని పేరంటమునకుఁ బోవుట మంచిదికాదు. అయ్యది గౌరవమునకు భంగము. ఇదియుంగాక నీతండ్రి నాతోఁ బగఁగొని యున్నాఁడు. పోవలదు."

అని శివుఁడు బదులు సెప్పెను. పరమేశ్వరుని మాటలు పార్వతి విన లేదు. ఆమె మరల మగనితో "బంధువులయింట జరుగు కార్యములకుఁ బిలుపుఁగొనకయే పోవచ్చును. అందులో నాతఁడు నాతండ్రి. నాకగౌరవ మేల జరుగును? సంశయింపక నన్నుఁ బోనిండు. చూచివత్తు" నని బ్రతిమాలు కొనెను. నీకిష్టమగునేనిఁ బోయిర"మ్మని శివుఁడు సెప్పెను.

అంతటఁ బార్వతి సంతోషమును బొంది దక్షుని యజ్ఞవాటికకుఁ బోయెను. యజ్ఞముఁ జూచుటకుఁ బెక్కుమంది వచ్చియుండిరి. దక్షుఁడు తన పుత్రికయైన పార్వతి వచ్చుట సూచియుఁ బలుకరించ లేదు. పార్వతి యెంతసేపు నిలిచి యున్నను రమ్మని పిలిచిన వారే లేకపోయిరి. దక్షుఁడప్పటికి నూరుకొనక పార్వతిని జూచి నీవెందుకు వచ్చితివి. నిన్ను నేను బిలువ లేదే? ఆవెండి కొండమీఁద నే యుండకపోతివా? నీవును నీ మగఁడును రాకయున్నచో యజ్ఞము జరుగదా?" అని పలువిధముల శివుని దూషించెను. తండ్రిమాటలు విని పార్వతి తన మనస్సులో "అక్కటా! మగఁడు వలదని చెప్పినను వినక తండ్రి గదా యని చూడవచ్చితిని. వచ్చినందుకు నా మగఁడు సెప్పినట్లే నాతండ్రి నన్నవమానించినాఁడు. పతియాజ్ఞఁ దిరస్కరించి వచ్చినందుకు ఫలమనుభవించితిని.

ఇట్టి యవమానమును బొంది మరల నానాథు నెట్లు సూడఁ గలను?'' అని విచారించి, విచారము కోపముగా మార దక్షునిఁజూచి "నీవు తండ్రివని తలఁచి నీవు సేయుచున్న యాగమును జూచుటకు వచ్చితిని. కాని కూఁడుగుడ్డలు లేక నీ చెంతకు రాలేదు. నా ప్రాణేశ్వరుని మాట నిరాకరించి వచ్చినందుకుఁ దగిన శాస్తి జేసితివి. నన్ను దూషించినం దుకు నేనంతగా విచారింపను. భగవంతుఁడైన నాభర్తను దూషించితివి. ఆయన మహామహిమ మూఢుఁడవైన నీ కెట్లు దెలియును? నీకు వినాశకాలము సమీపించుట చేతనే నామగనిని దూషించుచుంటివి. నీమొగముఁజూచినఁ బంచమహాపాతకములు సంభవించు"నని పలికి యగ్నిలోఁ బ్రవేశించి దేహము విడిచెను. ఆ వార్త పరమేశ్వరునకుఁ దెలిసెను. వెంటనే యాతఁడు వీరభద్రునిఁబంపి దక్షుని రూపుమాపించి యజ్ఞమును బాడు సేయించెను.

# 20 నలుఁడు

" సుగుణులైనవారు - జూదమాడఁగరాదు
ఆడి రేని కీడు - మూడితీరు "

నిషధదేశాధీశ్వరుండగు నలుఁడు విదర్భదేశాధిపతి యగు భీముని పుత్రికయైన దమయంతి రూపగుణలావణ్యాతిశయంబులు విని యామె యెడల మోహపరవశుఁడై యుండెను. ఇట్లుండ నొక దినమున నలుఁ డుద్యానవనమున విహరించుచుండ, నచ్చటికిఁ గొన్ని రాజహంసములు వచ్చినఁ జూచి, యాతఁడు వానింబట్టుకొన నెంతయో ప్రయత్నించి, తుదకొక దానిం బట్టుకొనెను. ఆ హంసభయపడి నలునిఁ జూచి మానుషస్వరముతో "రాజేంద్రా! నేను నీకొక సహాయము సేయుదును. నీ చిత్తము దమయంతిపై నిలిచి యున్నదని నే నెఱుంగుదును. కావున నే నిప్పుడామెకడ కరిగి నీరూపగుణంబుల నామె యొద్ద వర్ణించి నిన్నుఁదప్ప నన్యుల వరింపకుండునట్లు సేసెద" నని పలికెను. నలుఁడు సంతసమంది యామరాళమును విడిచెను. అంతట నయ్యది, తనకై వేచియున్న మరాళములఁ గలిసికొని, బయలుదేరి, విదర్భాపురోద్యానవనమును జొచ్చెను. అచ్చటికి దమయంతి సఖీజన పరివృతయై వచ్చి, నలునిచేఁ బట్టువడిన మరాళమునే గాంచెను. అమ్మరాళము దనకు నలుని గుణము

లన్నియు వర్ణించి చెప్పిన విని, యయ్యువిద నలునియందు బద్ధానురాగయై 'మరాళమా! నీవు నాయెడఁజూపిన దయకు నేను నీకెప్పుడును గృతజ్ఞురాలనైయుందును. నలుని గుణరూప విశేషములు నాయొద్దఁ జెప్పినట్లే నన్నుఁగూర్చి యాతనికిఁ జెప్పు'మని పలికెను. హంసయు నామె కోరిక ననుసరించి, యచ్చోటువాసి మరల నిషధకరుదెంచి నలునిఁ గాంచి దమయంతిఁగూర్చి చెప్పి చనెను. ఇట్లా నల దమయంతుల కంతరంగంబులఁ బొడమిన యనురాగ మంతకంత కభివృద్ధి నొందుచుండెను. దమయంతి నలునియందు బద్ధానురాగయై యున్నట్లు చెలికత్తెలు భీమరాజున కెఱింగించిరి.

అంతట భీమరాజు దమయంతికి స్వయంవరము చాటఁబంచెను. ఆ స్వయం వరమునకు రాజు లనేకులు వచ్చిరి. దేవేంద్రుఁడుగూడ దిక్పతులతో వచ్చెను. ఆతఁడు మార్గ మధ్యమున నలునిఁగాంచి యాతని గుణమును బరీక్షింపఁ దలంచి "నలరాజా! నీవు నిత్యసత్యవ్రతుండవు. నీవు మాకొక కార్యముసేయవలయు"నని యడిగిననలుఁడందుకుసమ్మతించెను. దేవతలాతనిం జూచి "మేము దమయంతీ స్వయంవరమున కరుదెంచితిమి. కావున నీవు మాకు దూతవై దమయంతి కడకరిగి మాలో నెవ్వరినైన వరించునట్లు గావింపు" మని పలికిన నలుఁడు వారిం గాంచి "దేవతలారా! ఇట్టి

కార్యము నన్ను సేయుమని నియోగించుట మీకు ధర్మమా? నేనును దత్స్వయంవరమునకే పోవుచున్నవాఁడను. అది యట్లుండ నిండు. వీరభట పరిరక్షితమయిన దమయంతీ సౌధము నెట్లు ప్రవేశింతును? ప్రవేశింతునుగాక! అంతఃపురకాంతయగు నా రమణీమణితో నెట్లు మాట్లాడుదును?" అని పలికెను. అప్పుడు దేవతలాతని కొక యదృశ్యఘుటిక నొసఁగి "దమయంతీ సౌధము నీవు ప్రవేశించు నప్పుడు నిన్నెవ్వరును జూడకుందురుగాక!''యని పలికిరి. దేవకార్యార్థమై నలుఁ డదృశ్యఘుటికా ప్రభావమున దమయంతీ సౌధమును బ్రవేశించి యామెను గాంచెను. దమయంతి నలునిఁ జూచి "ఓపురుషవర్యా! నీ వెవ్వరవు? ఈ యంతఃపురమును నీ వెట్లు ప్రవేశించితివి? "యని యడిగిన నా నలుండిట్లు పలికెను. "తరుణీమణీ! నేను దేవదూతను. నలుండనువాఁడ ఇంద్రాదిదేవతలు నీ స్వయంవరమునకు వచ్చిరి. వారిలో నొక్కరిని నీవు వరించునట్లు సేయుమని నన్ను నీ కడకుఁ బంపినారు. వారి మహిమచేతనే యీ యంతఃపురమును బ్రవేశింపఁగలిగితిని. కావున నీవు నా పలుకులాలించి వారిలో నొక్కరిని వరింపుము.

ఆ పలుకులు విని దమయంతి యాతనిఁజూచి "ఏనేడ? ఇంద్రాదులేడ? నలసార్వభౌమా! నీ గుణములు హంస

వలన విని నాచిత్తము నీయందే నిలిపి ధ్యానింపుచుంటిని. నీ నిమిత్తమే యీ స్వయంవరము చాటింపఁబడినది. నీవు నన్ను గ్రహింపవేని నేను ప్రాణముల విడిచెదను." అని పలికెను. నలుం డెంత సెప్పినను నామె వినలేదు. అంతట నలుఁడచ్చోటు వాసి, దేవతలకడ కరుదెంచి, యామె వాక్యములు వారికిఁ దెలియఁజేసెను. స్వయంవర సమయమున దేవతలందఱును నలుని రూపముధరించిరి. నిజమగు నలుండెవ్వఁడో యెఱుంగఁజాలక, దమయంతి మిగుల విచారపడి కరుణింపవేయని దేవతలను బ్రార్థింప వారును కరుణగలవారై తమ తమ రూపములఁ దాల్చిరి. దమయంతి సమ్మోదభరితయై నలుని కంఠమునఁ బూలమాలికను వైచెను.

తరువాత దేవతలు తమలోకమునకుఁ బోవుచు మార్గమునఁ గలింగాంచి "ఎక్కడికిఁ బోవుచుంటి"వని యడిగిరి. దమయంతీ స్వయంవరార్థమని యాతఁడు బదులుసెప్పెను. దేవతలు నవ్వి దమయంతి నలుని వరించెనని చెప్పిరి. కలి దేవతల వాక్యములాలించి నిజమనోరథభగ్నమునకు నలుని రాజ్యభ్రష్టునిగాఁ జేయఁదలఁచెను. నలుండును గలిమహిమ వలనఁ దన పినతండ్రి కుమారుండగు పుష్కరునితో జూదమాడి, సమస్తరాజ్యశ్రీలను గోలుపోయెను. రాజ్యచ్యుతుఁడైన నలుఁడు తన కుమారుని విదర్భకుఁబంపి దమయంతీ

సహితుఁడై యడవులకుఁ బోయెను. సర్వరాజ్య శ్రీవిహీనుఁడైన నలుఁ డట్టి కష్టకాలమునందును మామగారి గృహంబున కరుగుటకు సమ్మతింపలేదు. దమయంతిని బుట్టినింటికేగుమని నలుండాంతో చెప్పెనుగాని యామె సమ్మతింపలేదు.

దమయంతి యరణ్యమునఁ బడు నవస్థఁ జూడఁజాలక, యొక వృక్షము క్రింద నామె నిద్రించు సమయమున, నామె వస్త్రమున సగముచింపి, తాను గట్టుకొని నలుండామె నెడఁబాసిపోయెను. ఆమె నిద్రనుండి మేల్కాంచి నలునిఁగానక యనేక విధములఁ బరితపించి సేయునది లేక యరణ్యమునఁ గ్రుమ్మరుచుండెను. అట్టియెడ మహాహియొక్కటి యామెం గఱువనున్న సమయమున నొక కిరాతుఁడు రయమునవచ్చి యామె ప్రాణముల రక్షించెను. కాని యక్కిరాతుఁనకు మరణకాలము సమీపించుటచేత నామె నపేక్షించి, పాతివ్రత్యమహిమవలన దగ్ధుఁడయ్యెను. అనంతరము, దమయంతి నలుని నన్వేషించుచు నయ్యరణ్యమునఁ నొక్కయెడ మునులఁగాంచి, వారలవలన నలుఁడు జీవించియుండెననియుఁ, దా నతనిని మఱలఁ గలిసికొనుననియు నెఱింగి, యచ్చటనుండి బయలుదేరి, సుబాహుపురంబున కరిగి, రాజమాతయొద్ద సైరంధ్రిగా నుండెను.

ఇక్కడ నలుఁడు దమయంతిని విడిచివచ్చినందుకు మిగుల విచారించి, మఱల నామె కొఱకరిగెను. కాని యామె కనుపింపలేదు. ఇట్లామె నన్వేషించు, నాతఁడొక చోట సర్పదష్టుఁడై విచారించుచుండఁ, గర్కోటకుఁడు సాక్షాత్కరించి 'నళరాజా! నీవునాచేఁ గఱవఁబడితివి. అందుకు విచారింపకుము. నీశరీరమున నావిషంబుండు నంత వఱకు నీకెట్టి భయముండదు, నీవు దమయంతిని గతిపయ దినములలోనే కాంచఁగలవు. నీకు నీనిజరూప మెప్పుడు కావలయునో యప్పుడునన్నుఁ దలఁచుకొనుము. అప్పుడొక వస్త్రము నీకడకువచ్చును. దానంజేసి నీనిజరూపము నీవు వడయుదువు. మఱియు నీ కొక్క విషయము చెప్పవలసి యున్నది. పరిచ్ఛన్నవృత్తిని నీవు ఋతుపర్ణమహీకాంతుని సేవింపుము" అని పలికి యంతర్ధానుఁ డయ్యెను. నలుఁడు ఋతుపర్ణుని జేరి యశ్వశిక్షయందుఁ బ్రవీణుఁడననియు, వంట సేయువాఁడననియుఁ, బలికి యాతనిని సేవించుచుండెను.

విదర్భాధీశుఁడయిన భీముఁడు నల దమయంతుల నరయఁ బెక్కురను బెక్కు స్థలములకుఁ బంపెను. సుదేవుఁడను బ్రాహ్మణుఁడు సుబాహు పురమున కరిగి, యచ్చట దమయంతినిఁ గనుంగొని విదర్భకుఁ దోడితెచ్చెను. మరల నాతఁడు నలునిజాడల నరయుటకు బయలుదేరి, ఋతుపర్ణుని

# 22 దశరథుఁడు

'సాధుజనుల కెగ్గు సల్పిన దప్పక
హానివచ్చు నెంతవానికైన'

వేఁటయనునది సప్త వ్యసనములలో నొక్కటియని ధర్మశాస్త్రములయందుఁ జెప్పఁబడి యున్నది. రాజులు సాధారణముగా వేడుకకొఱకు వేఁటాడుచుందురు. ఈ వేఁట వలనఁ బాపము సంభవించుటయేగాక యొక్కొక్క సమయమున హానిగూడఁ గలుగుచుండును. పూర్వమయోధ్యానగరమును బాలించు దశరథుఁడను నొకనృపాలుఁడుగలఁడు. అతఁడొకనాఁడు సరయూనదీతీరమున నున్న యరణ్యమున వేఁటాడఁబోయెను. అతఁడు వేఁటాడి యలసి, యొకవృక్షము నీడను విశ్రమించియుండెను. ఆసమయమున మునిబాలకుఁడొక్కఁడు నదికివచ్చి కుండతో నీళ్ళను ముంచుచుండెను. నీరంబుల ముంచుచుండఁగలిగిన బుడబుడశబ్దము దశరథుఁడు విని, వనగజంబొండు దాహము దీర్చుకొనుటకు వచ్చినదని భ్రమించి, చప్పుడునుబట్టి సూటిగ బాణము విడిచెను. ఆ బాణము తగిలి మునిపుత్రుఁడు "హా" యని యఱచి నేలఁ బడెను. మనుష్య స్వరమువిని దశరథుడు తొందరగాఁ బోయి తన శరముచే నేలఁబడియున్న మునికుమారునిఁ జూచెను. మునిబాలకుఁడును దన్ను బాణముచేఁ గూల్చిన వాఁడతఁడేయని తెలిసికొని దశరథునిఁజూచి యిట్లుపలికెను.

"ఓరాజా! నీవు నన్నేల చంపితివి? అడవిలోనుండి యెవ్వరి జోలికిఁబోకుండఁ దపస్సుఁ జేసికొనుచుండు సాధువులమగు మేము నీకేమి యెగ్గుగావించితిమి? నేను నామృతికి విచారిం పను గాని పుట్టు గ్రుడ్డివారైన నాతల్లి దండ్రుల కొఱకు విచారపడుచున్నాను. వారికి నేనేకపుత్రుఁడను. నేనుదప్ప వారి కెవ్వరును దిక్కులేరు. వారు మిగుల దాహముగొని జలముఁదెమ్మనఁగా నిటువచ్చితిని. వచ్చి యిట్లు నీచేతఁ జచ్చితిని. ఇఁక వారి కెవ్వరుదిక్కు? దాహముచే వారు సొకొఱకెదురుసూచుచుందురు." ఆమాటలు విని దశరథుఁడు కొంతవఱకు నిశ్చేతనుఁడైయుండి, యమ్మునికుమారున కిట్ల నెను. " బ్రాహ్మణపుత్రా! నేను దశరథుండను నృపా లుఁడను. మృగయావ్యాజమున నరణ్యమునకువచ్చి నీవు జలముల ముంచుచుండ, వనగజంబని భ్రమించి శరప్రయో గము సేసితిని. నే నీయపరాధము బుద్ధిపూర్వకముగఁ జేసి నదికాదు. నేను సాధువుల హింసించు పాపరతుఁడఁగాను. కాని నిన్నుఁజంపిన పాపముమాత్రము నన్నుఁ గట్టి కుడుపక మానదు" అందుకు బ్రాహ్మణతనయుం డాతనికిట్లుచెప్పెను. " రాజా! నీవు నిశ్చయముగా నిక్కార్య మెఱుంగక చేసి తివి. గతించినదానికి వగచినందువలనఁ బ్రయోజనము లేదు. కావున నేను జెప్పినయట్లుసేయుము. ఈదిక్కునఁ బోయితి వేని కనుచూపు మేరలో మాకుటీరము గనుపించును. అందు

గుడ్డివారయిన నా తల్లిదండ్రులున్నారు. నీవీకుండతో జలముఁదీసికొనిపోయి నెమ్మదిగా వారికిమ్ము. ముందేమియు మాటలాడవలదు. వారు జలములఁ ద్రాగినపిదప సంగతి యంతయుఁ దెలుపుము. వారు నిన్నుఁ గరుణింతురు. అట్లు సేయకపోయితివేని, వారెట్లయిన జరిగినదంతయు దివ్యదృష్టి నెఱింగి శాపాయుధమున నీవంశనాశనము సేయఁగలరు." అట్లు సెప్పి యాతఁడు ప్రాణములు విడిచెను.

మునికుమారుఁడు చెప్పినట్లు నీరునుగొని దశరథుఁడు వృద్ధ తాపస దంపతుల యొద్దకుఁ బోయెను. అడుగుల చప్పుడు విని వారు తమకొడుకువచ్చెననుకొని "నాయనా! నీరమునకుఁ బోయి యింతయాలస్యముఁ జేసితివేమి ? మేము మిగుల దాహముగొనియుంటిమే" యని పలికిరి. దశరథుఁడు మాటలాడలేదు. ఆతఁడు మాటలాడకపోవుటచేత వారు మరల "కొడుకా ! మేమీ మాటఁబలికితిమని నీకుఁగోపము వచ్చినదా? మాకు నీవుగాక మఱియెవ్వరు దిక్కుగలరు ?" అనిపలికిరి. ఎంతసేపటికిని దశరథుఁడు మాటలాడక యుండు టచే వారు జలముఁ ద్రాగకయుండిరి. అంతట దశరథుఁడు భయమందుచు, వడఁకుచున్న యెలుంగుతో జరిగిన సంగతి నంతయుఁ దెలిపెను. కొడుకు చావు విని వారు పెద్దపెట్టున నేడ్చి "రాజా! తాపసులకుఁ గీడుసేసి యెవ్వరును బ్రదుకఁ

జాలరు. మేము కోపించితిమేని నీవంశ మంతయు నాశనమై పోవును. కాని నీవు నిజము చెప్పుటచేత బ్రదికి పోయితివి. పుత్రశోకము నందుచు మేమిఁక జీవింపము. నీవుగూడ మావలెనే కుమారు నెడఁబాసినందువలనఁ గలిగిన దుఃఖము చేతనే మరణింతువు గాక!" యని శాపమిచ్చి యప్పుడే ప్రాణములు విడిచిరి.



# 23 గృధము—జంబుకము

"స్వార్థపరు లెందుఁ దమతమ - పనులకొఱకు
పరుల వంచింప నెంతు రె - ప్పగిదినైన "

పూర్వ మొకపురమున మరణించిన తమ కుమారునిఁ దల్లిదండ్రులును, బంధువులును బ్రేతభూమికిఁ గొనిపోయి, యబ్బాలునిఁ గూర్చి విలపింపఁ దొడంగిరి. అప్పు డచ్చటి కొక గ్రద్ద వచ్చి బాలునికై యేడ్చువారిం గాంచి యిట్లు పలికెను. "మనుజులారా! భయ మింతయైనను బూనక యిక్కడ నిట్లు విలపించుట తగదు. సంధ్యాసమయ మగు చున్నది. భూతప్రేత పిశాచ సంఘము లిచ్చట సంచరించు

చుండును. జననమరణములు దేహికి సహజములై యున్నవి. చచ్చినవారితోడ బ్రదికియున్నవా రేగుదురా? ఏడ్చినందు వలనఁ బ్రయోజన మావంతయు లేదు. మనమందఱము నెప్పుడో మరణింపవలసిన వారమే. కావున నిక్కుమారు ని కై చింతింపక గృహమున కరుగుఁడు.''

గ్రద్ద మాటలువిని వా రాశవము నచ్చట విడిచి యరుగ నెంచుచుండ, నాసమయమున నచ్చటి కొక నక్క యరు దెంచి, వారిని విలోకించి ''ఓ వెఱ్ఱిమానవులారా! గ్రద్ద మాటల నాలకించి భయమంది యీబాలుని విడిచి పోవు టకు మీకుఁ గాళ్లెట్లాడినవి? ఇంకను జీకటి పడలేదు. ఒక వేళ మీరిట్లేడ్చుచున్నచో దైవకృపవలన నీకుమారుఁడు మఱల జీవించు నేమో?'' యని పలికిన వారు మరల వచ్చి పెద్ద పెట్టున నేడ్వసాగిరి. అప్పుడు గృధ్రము వారింగాంచి ''మందబుద్ధియైన జంబుకము మాటల నాలకించి యిట్లు మరల వచ్చితిరా! మీబుద్ధిహీనతను జూచిన నాకు మిగుల విచారము జనించుచున్నది. ఎచ్చటనైనఁ జచ్చినవారు తిరిగి బ్రదుకుదురా? మృత్యుదేవత యీబాలుని జీవముల నిది వఱకే యపహరించినది. ఇఁక నెంత వగచినను లాభము లేదు కావున. దానధర్మములు సేసి యీతండు సుగతి కేగు నట్లు సేయుఁ'' డని పలికెను. గ్రద్ద పలుకుల కాక్షేపించుచు

నక్కయిట్లు పలికెను. క్రూర బుద్ధిగల యీ గృధ్రము మాటల వినవలదు. ఇట్టికుమారుని విడిచి మీ రెట్లుజీవింపఁ గలరు ? నాకే మిగుల దుఃఖము కలుగుచున్నది. కరుణా విహీనులై మీరీ బాలుని విడిచిపోవలదు. దైవము మీయె డల ననుగ్రహము సూపకయుండునా ? అనుగ్రహించి బాలుని బ్రదికించెనేని సంతోషమే. లేనియెడల నప్పుడే పోవచ్చును. ఇప్పుడే యింత తొందరయేల?" ఆమానవుల మాటలజూచి గృధ్రమిట్లనెను. "నేను పుట్టి యనేకవేల వత్స రములయ్యెను. ఎప్పుడును జచ్చి మరల జీవించినవారినిఁ జూడలేదు. కాని యొక విషయముమాత్రమున్నది. చచ్చిన వారు మరియొక గర్భమునమాత్రము తిరిగి పుట్టుదురు. ఈ నక్కమాటలు విని మీరేల వృథాయాసమందెదరు ? " అని పలికిన విని వారాబాలుని విడిచిపోవుచుండ నక్క వారి కడ్డమువచ్చి "గ్రద్దమాటలకు మీరు మోసపోవుచుంటిరి. మున్ను శ్రీరామచంద్రుఁడు మరణించిన యొక బ్రాహ్మణ కుమారుని బ్రతికించినాఁడు. నారదుఁడు తన తపఃప్రభావ మున సృంజయుని కొడుకును బునర్జీవితునిఁ జేసినాఁడు. అట్లె యే మహానుభావుఁడయిన మీశోకమాలకించి కుమారుని బ్రదికించునేమో? ప్రయత్నింపుఁడు."

జంబుకము చెప్పినమాటలు విని వారందఱును మరల వచ్చి శవముచుట్టునుజేరి, పెద్దపెట్టున రోదనముసేయసాగిరి.

ఆగృధ్రజంబుకములు రెండును నాబాలుని కళేబరమును నాహారముగాఁగొనుటకై తమతమ వాక్యములనేర్పున వారల మరలించుచుండెను. నిశాసమయము తనకనుకూలమగును గావున జంబుక మట్లు చెప్పుచుండెను. పగటికాలము దన కనుకూలము గావున వారల మరలించుటకు గ్రద్ద యట్లు పలుకుచుండెను. ఇంతలో సూర్యుం డస్తగిరిం జేరెను. అట్టి సమయమున శ్మశాన క్షేత్రవిహారుఁడును, అనాథ సంరక్షణ పరాయణుఁడును, నగు పరమేశ్వరుఁడు బాలునికై యేడ్చు జనులకుఁ బ్రసన్నుఁడయ్యెను. వారా మహాత్ము నకు మ్రొక్కి "దేవా! మాశోకము నీవాలించి ప్రసన్నుఁడ వైతివి. ఈబాలుఁడు మృతినందుటచే మేమిట్లు విలపించు చున్నాము. దయాళుఁడవగు నీవీ బాలుని బ్రదికించి మా శోకమును బోఁగొట్టుము" అని వేడిన కరుణామయుండగు శంక రుఁడు బాలుని బ్రదికించి, గృధ్రజంబుకంబుల కెన్నఁడు నాకలిదప్పులు కలుగకుండునట్లు వరం బనుగ్రహించి యంత ర్ధానుఁడయ్యెను.

స్వార్థపరులగు వారు తమతమ మాటల నేర్పున గృధ్ర జంబుకంబులవలె నితరులకు మోసముసేయఁ జూచు చుందురు.



# 24 గోమాయువు

పూర్వము విజయపురమను పేరుగల నగరమునకు సమీపమున నొక మహారణ్యముండెను. ఆమహాటవి కొక నాఁడొక కిరాతుఁడు వేఁటకుఁ బోయి, యొక పుట్టదగ్గఱ నొక వనగజం బుండుటఁ జూచి యాపుట్ట నెక్కి తనయొద్ద నున్న వాడిగల కత్తిచే దాని తుండమును నఱికి చంపెను. అప్పుడా పుట్టనుండి యొక ఘోరసర్పము వెలికివచ్చి యా వేట కానిని గఱచెను. అంతఁ దన చేతనున్న కత్తితో నాపాముం జంపి, విష మెక్కుటచే నాతఁడు గూడ నేలఁ బడి ప్రాణములు విడిచెను. ఆసమయమున నచ్చటి కొక గోమాయువు వచ్చి సంతోషించుచుఁ దనలో నిట్లనుకొనెను. "ఆఱు నెలల వఱకు నాకీ యేనుఁ గాహారమునకు సరిపోవును. కిరాతుఁ డేడురోజులకును, సర్ప మొకదినమునకును, వేటకాని వింటి నర మీపూటకును జాలును" అని తలఁచి వేటకాఁ డెక్కు వెట్టి యుంచిన విల్లును సమీపించి దాని నరములను గొఱుక సాగెను. కొంత సేపటికి బెట్టు దప్పి యావింటి కొమ్ము బెడిసి, యానక్కయొక్క శిరస్సునకు బలముగాఁ గొట్టుకొనెను. వెంటనే యది కెవ్వున నఱచి క్రిందఁబడి కొట్టుకొని ప్రాణములు విడిచెను. కావున దురాశ యెవ్వరికి నుండరాదు.

"ఆ. నీళ్లలోని మీను ♦ నెఱిమాంస మాశించి
గాలమందుఁ జిక్కు ♦ కరణి భువిని
ఆశ దగిలి నరుఁడు ♦ నాలాగె చెడిపోవు
విశ్వదాభిరామ ♦ వినరవేమ."

# 25 మార్కండేయుఁడు

పూర్వకాలమున మృకండుఁడను నొక మునీంద్రుఁడు గలఁడు. ఆతని భార్య పేరు కుముద్వతి. మృకండుఁడు మహా తపశ్శాలి. ఆ దంపతులకు సంతానము లేదు. ఒకనాఁడు కుముద్వతి సంతానమునుగూర్చి విచారించుచుండ, విచారమునకుఁ గారణమేమని మునీంద్రుఁ డడిగెను. అందుకా పతివ్రత "నాథా! పుత్రులు లేని చింతదప్ప నాకు మఱియొక చింత లేదు. పుత్రులు లేని వారికి గతులు లేవని ధర్మశాస్త్రముల యందుఁ జెప్పఁబడి యున్నది. కావున సంతానము కొఱకు మీ రేమయిన మార్గముఁ జూడవలదా?" యని పలికెను.

అంత నా దంపతులు సంతానము నిమిత్తము తపము సేయఁదలఁచి కాశీనగరమున కరిగిరి. అచ్చట భగవంతుఁడగు

విశ్వనాథుఁ డున్నాఁడు. పరమపావనమయిన గంగానది యున్నది. గంగయందు స్నానము చేసినచో సర్వపాపములు నశించును - సౌఖ్యము లొదవును. నిర్మలమైన జ్ఞానము గలుగును - ముక్తి లభించును - అట్టి వారణాసికే యీముని దంపతు లరిగి గంగయందుఁ గృతస్నానులై విశ్వనాథుని యాలయమును బ్రవేశించి, నిశ్చల చిత్తముతో నమ్మహాదేవుని సేవించుచుండిరి. ఇట్లు కొన్నాళ్లు గడచినఁ బరమేశ్వరుఁడు వారియెడఁ గరుణ వహించి, ప్రసన్నుఁ డయ్యెను. మృకండుఁడు తన భార్యతో నమ్మహాదేవునకు సాష్టాంగ నమస్కార మాచరించి, యనేక విధములఁ బ్రస్తుతించెను. శంకరుఁడును సంతోషించి యామునీంద్రునిఁ జూచి "నీభక్తికి మెచ్చితిని. నీయభీష్టము గ్రహించితిని. నీవు కుమారునిఁ బడయుటకుఁ గదా తపం బొనర్చితివి? అట్లే యనుగ్రహించితిని. కాని, యొక్కవిషయము మాత్రము నీతోఁ జెప్పవలసి యున్నది. పేరు ప్రతిష్ఠలు లేక నూఱేండ్లు జీవించు పుత్రుఁడు గావలయునా? లేక పేరు ప్రతిష్ఠలు గలిగి పదియాఱేండ్లు మాత్రమే జీవించు పుత్రుఁడు గావలయునా? ఆలోచించుకొని చెప్పుము," అని పలికెను. ఈశ్వరుని ప్రశ్న మహాకష్టమై యున్నది. అందులకు మృకండుఁ డేమని ప్రత్యుత్తర మీయవలయునో యని కొంతవడి యాలోచించెను. నిశ్చలచిత్తముతో నంతకాలము తపము

సేయఁగా నీశ్వరుఁడు ప్రత్యక్షమై యిట్లు పలికె నేమాయని యాతఁడు విచారించి తుదకు ధైర్యము వహించి శివుని విలోకించి "మహాత్మా! నీచర్య లనంతములు - నీమాయ నెవ్వరును గనుఁగొనఁ జాలరు - నాచిత్తమును బరీక్షించుటకే యిట్లానతిచ్చితివని తలంచెదను. కానిమ్ము. నీదయ యెట్లున్న నట్లగును. మూఢుఁడై పేరుప్రతిష్ఠలు లేక నూఱేండ్లు జీవించు కుమారుఁ డేల? విజ్ఞానియు, యశము వెచ్చునాఁడును నగు కుమారునే, పదియాఱేండ్లు జీవించు వానినే ప్రసాదింపు" మని వక్కాణించెను. అంతట పార్వతీకాంతుఁడు మృకండుఁడు గోరినట్లు వర మనుగ్రహించెను.

తరువాత మృకండుఁడు భార్యాసహితుఁడై నిజాశ్రమమునకు వచ్చెను. కొన్నాళ్లకుఁ గుముద్వతి గర్భము ధరించి యొక శుభలగ్నమునఁ గుమారునిఁ గనెను. దంపతు లిరువురును మహానందమును బొందిరి. కుమారునకు జాతకర్మాది మహోత్సవము గావింపఁబడెను. ఆబాలునకు మార్కండేయుఁడను పేరు పెట్టఁబడెను. మార్కండేయున కైదువత్సరములు వచ్చిన యంతనే మృకండుఁ డాతని కక్షరాభ్యాసము సేయించెను. తండ్రి యనుగ్రహమున నాతఁడు క్రమముగా విద్యల నేర్చి, మంచి జ్ఞానము నార్జించి తల్లిదండ్రులకును నయ్యరణ్యమునంగల మునులకును మోదము గూర్చుచుండెను.

ఇట్లు కొన్ని సంవత్సరములు గడచినవి. పరమేశ్వరుఁడిచ్చిన యాయువు సమీపించుచుండెను. భార్యయు - మృకండుడు నందుల కైయొకనాఁడు "అయ్యో! కుమారునకుఁ బదియాఱవ వత్సరము సమీపించుచున్నది. ఏమిసేయుదము? మన కెవ్వ రడ్డపడుదురు? భగవంతుని వాక్య మన్యథాజరుగునా? ఇట్టి కుమారరత్నమును బాసి బ్రదుకఁగలమా?" యని విచార పడుచుండిరి. అప్పుడే యరణ్యమునుండి మార్కండేయుఁడు వచ్చి విచారించుచున్న తల్లిదండ్రులనుజూచి "జననీ జనకు లారా! మీ మొగంబు లనుదినమువలెఁగాక నేఁడు మిగుల వాడియున్నవి. దీర్ఘవిచారపరులైయున్న విధము గన్పట్టు చున్నది. నేనేమయిన మీయెడలఁ జేయరాని కార్యముఁ జేసియుంటినా? మీయాజ్ఞను బాలింపనైతినా? " యని భక్తిపూర్వకముగఁబలికెను. కుమారుని వాక్యములు విని మృకండుఁ డిట్లనెను. "కుమారా! నీ యట్టివానిని బుత్రు నిగాఁ బడసినందువలన మేము ధన్యులమైతి మని సంతో షించుచుంటిమి. ఇప్పు డట్టి సంతోషము మా హృదయ ముల నెడఁబాయుచున్నది. మేము నిన్నుఁగూర్చి యగాధ మైన సముద్రములో మునిఁగి పోవుచుంటిమి. మమ్ముద్ధరిం చుట కెవ్వరును లేరు. మా విచారకారణము నీకెఱింగించు టకు నోరు రాకయున్నది." అందుకు మార్కండేయుఁడు "తల్లిదండ్రులారా! మీరు శంకింపవలదు. ధైర్యమును

బూని మీ విచారమునకుఁ గారణముఁ దెలుపుఁడు. దానిని మీచిత్తములయందే యడంచుకొని యున్నచో, నదినశించు నట్టి యుపాయంబు నారయు టెట్లు?" అని పలికెను. తుద కా మునిదంపతులు కొంత తడవునకుఁ జింత నడంచుకొని కుమారునిఁజూచి యిట్లుపలికిరి. "మాకు సంతానము ల్లేక పరమేశ్వరునిఁగూర్చి తపముసేసి నిన్నుఁబడసితిమి. పరమేశ్వరుఁడు నీకుఁ బదియాఱు వత్సరముల యాయుర్దాయము మాత్రమే యిచ్చియున్నాఁడు. అది పూర్తికావచ్చినది. ఇఁక నీ యట్టి పుత్రునిఁ బోఁగొట్టికొని మేమీ భూమిపై నెట్లు బ్రతుకనేర్తుమా యని చింతించుచున్నాము."

ఆ మాటలు విని మార్కండేయుఁ డొకింతయు నధైర్యమును బొందలేదు. ఆతఁడు తల్లిదండ్రులను జూచి యిట్లు పలికెను. "మీరు నాకొఱకిట్లు విచారింపవలదు. భగవంతుని యాజ్ఞను దాటుట కెవ్వరికిని దరముగాదు. ప్రతి విషయమును బురాకృతకర్మ ననుసరించి యుండును. పరమేశ్వరుఁడు మనచిత్తముల ననేకవిధములఁ బరీక్షించుచుండును. నా యాయుర్దాయమునుగూర్చి మీరు దుఃఖింపవలదు. పరమేశ్వరుఁడు దయా సముద్రుఁడు. తపఃఫలంబుగ నన్ను మీకతఁడనుగ్రహించినాఁడు. పుట్టినది మొదలు బుద్ధిపూర్వకముగ నేనేపాపముఁజేసి యెఱుంగను. ఆతఁడు

నన్నేలచంపును? ఒకమాటవినుఁడు. మీరు ధైర్యముతోఁ నుండుఁడు. నేనిప్పుడేపోయి యీశ్వరునిఁగూర్చి తపము సేసి, యాతనిని ప్రసన్నునిగాఁ జేసికొందు. నేనుమరణింతు నని మీరు తలంపవలదు"అని పలికి తల్లిదండ్రులకు ధైర్యము సెప్పి, మార్కండేయు డాశ్రమమును విడిచి, సమీపమున నున్న శివాలయమును బ్రవేశించి, యందు లింగాకృతిఁ దాల్చియున్న పరమేశ్వరునిఁ బూజించుచుండెను. అతనికిఁ బదియాఱేండ్లు నిండినవి. ఆ దినమున యమభటులువచ్చి "ఓయీ! బాలకా! ఇఁక శివపూజమాని యీవలకురమ్ము. నీయాయుర్దాయము నిండినది. అందుచేత నిన్నుఁగొనిపోవు టకు యముఁడు పంపఁగా వచ్చితి''మని పలికిరి. యమ భటులు మిక్కిలి భయంకరరూపులైయుండిరి. వారినిఁజూచి నచో నెట్టివారయినను భయమంది తీరుదురు. మన మార్కండేయుఁడు బాలుఁడైనను నొక్కింతయును భయ మందలేదు. అతఁడు కింకరులఁజూచి "మీరెవరు? ఇక్కడి కేల వచ్చితిరి? కాలుఁడెవఁడు? నన్నుఁదోడ్కొని రమ్మనుట కాతఁడెవ్వఁడు? పొండు. నేను శివపూజ మానువాఁడను గా''నని పలికెను. యమభటులు బాలుని ధైర్యమున కచ్చెరువుఁబొంది' యాతనిని బలవంతముగాఁ గొనిపోవలయు నని తలంచియు, నాతనిని ముట్టుకొనిన స్వామి పుట్టిమునుం గునో యని భయపడిరి. అంతటవారు చేయునదిలేక మరలి

పోయి యమునిఁజూచి, 'యమధర్మరాజా! నీ యానతిని గొని మేము మార్కండేయుని జీవములఁ గొనుటకుఁబోయి యుంటిమి. ఆతని తేజము మాకు మిపులభయము గొలుపుటంజేసి సమీపింప లేక పోయితిమి'అని విన్నవించిరి.

కింకరుల మాటలు విని యముం డద్భుతమంది, వెంటనే పాశహస్తుఁడై మార్కండేయుఁడు శివపూజ సేయుచున్న స్థలమునకు వచ్చెను. అట్లు వచ్చి యముఁ డమ్ముని బాలకునిఁ జూచి "నీయాయువు తీరినది. కావున రమ్మని యట్టహాసముతోఁ బలికెను. మార్కండేయుఁడు జంకలేదు. "నేను శివపూజ విడువను. అనవసరముగ నాతో మాటలాడుచు నాపూజకు విఘ్నము గలిగింపవలదు – నీవు యముఁడవని నాకుఁ దెలియును – నేనురాను. పొమ్ము" అని పలికెను. "ఔరా! కాలుఁడనగు నన్నుఁ దృణీకరించి పలుకుచుంటివా? ఇదగో నీజీవములు హరించుచున్నాఁడ" నని పలుకుచుఁ దనపాశమును మార్కండేయుని మెడకువేసి లాగఁజొచ్చెను. మార్కండేయుఁడు తాను పూజించుచున్న శివలింగమును గట్టిగాఁ గౌఁగిలించుకొని "హా! పరమేశ్వరా! కాలుని బారినుండి నన్నురక్షింపుము! రక్షింపు" మని విశ్వనాథునిఁ బ్రార్థింపఁదొడంగెను. అప్పుడా లింగమునుండి పరమేశ్వరుఁడు సాక్షాత్కరించి యమునిఁ జూచి

“ఓయీ! దండధరా! ఈతఁడు నాకుఁ బ్రియమైన భక్తుఁడు. ఇట్టివాని జీవముల హరించుట కేల వచ్చితివి? పొమ్ము. పోకున్నచో నిన్ను భస్మమొనర్తు” నని పలికెను. యముఁడు భయంపడి పరమేశ్వరునకు మ్రొక్కి వచ్చిన దారినే తన లోకమునకుఁ బోయెను. యముని బారిఁద్రోలి తన్నురక్షింపఁ బ్రసన్నుఁడైన శివునకు మార్కండేయుఁడు సాష్టాంగ దండము లొనర్చి యనేక విధములఁ బ్రస్తుతించెను. శివుఁడు ప్రీతుఁడై యక్కుమారునిఁ జిరంజీవిగాఁ జేసి చనెను.

ఇట్లు మార్కండేయుఁడు శివుని యనుగ్రహమునఁ జిరాయువు వడసి నిజాశ్రమమునకుఁబోయి, తానేమయ్యెనో యని బెంగపడి చింతించుచున్న తల్లిదండ్రులను జూచి జరిగిన వృత్తాంత మంతయుఁ దెలిపెను. అప్పుడు వారు పొందిన యానందము వర్ణనాతీతము. ఆశ్రమమున నున్న మునులందరును మార్కండేయుని భక్తికి మెచ్చి పెక్కువిధముల దీవించిరి.



## 26 ఏకలవ్యుడు

### గురుఁడే దైవము.

పూర్వము ఏకలవ్యుఁడు అను నొక యెరుక బాలుఁడుండెను. ఆతనికి అస్త్రవిద్య నేర్చుకొనవలెనని కోరిక పుట్టెను. అంతట నాతఁడు కౌరవులకును బాండవులకును విద్య నేర్పుచున్న ద్రోణాచార్యుని కడకుఁబోయి తన కస్త్రవిద్య నేర్పవలసినదని ప్రార్థించెను. "నీవు తక్కువకులము వాఁడవగుటచేత నేను నేర్ప" నని ద్రోణుఁడు చెప్పెను. అంతట నాతఁడు చేయునది లేక తిన్నగా నొక యడవికిఁ బోయి మట్టితో నొక బొమ్మనుజేసి దానినే ద్రోణునిగ భావించి పూజించుచు నస్త్రవిద్య నేర్చుకొనుచుండెను. కొన్నాళ్లకాతఁడు అస్త్రవిద్యయందుఁ బరిపూర్ణుఁడయ్యెను. ద్రోణుఁడు తనకు విద్య నేర్పనని చెప్పినను నాతనియందు లక్ష్యముంచి యతనినే గురువుగ భావించుట వలన నేకలవ్యుఁడు అస్త్రవిద్యను బాగుగ నేర్చుకొనఁ గలిగెను.

ఇట్లుండఁ గొన్నాళ్ళకుఁ గౌరవులును, బాండవులును ఏకలవ్యుఁడున్న యరణ్యమునకు వేటలాడ వచ్చిరి. రాజకుమారుల వెంటవచ్చిన యొకకుక్క మొఱుగుచుండ దాని ధ్వనినిబట్టి యేకలవ్యుఁడు గురినిల్పి శరమును విడిచెను. అది తిన్నగావచ్చి మొఱుగుచున్న యాకుక్కకుఁ దగిలెను.

రాజకుమారు లదిచూచి యాశ్చర్య మందిరి. అంత నర్జు నుఁడు గురునికడకరిగి "గురువర్యా! ఈవిచిత్రమును చూచి తిరా? ధ్వనినిబట్టి యెవ్వఁడో మాశునకముపై శరమును బ్రయోగించినాఁడు. ఇట్టి విలుకానిని నేనెందును జూచి యెఱుఁగ" నని పలికెను. అంతట ద్రోణుఁడు అతనిని వెంట బెట్టుకొని శరమువచ్చినజాడను బట్టిపోయెను. ఏకలవ్యుఁ డున్న ప్రదేశమును జేరెను. ఏకలవ్యుఁడు ద్రోణునకు నమ స్కరించి బహువిధములఁ బూజించెను. ద్రోణుఁడు వానిం జూచి 'నీకు గురుఁడెవ్వఁడు' అని యడిగెను. అందులకు ఏకలవ్యుఁడు" ద్రోణాచార్యుఁడు నాకుఁ గురుఁడు. ఆతని ప్రతిమను బూజించుచు అన్ని అస్త్రవిద్యలు నేర్చుకొంటి' నని పలికెను. ఆపలుకులకు అర్జునుఁడేగాక ద్రోణా చార్యుఁడుగూడ అద్భుతమందెను. తన శిష్యుడయిన అర్జు నునికంటె నాయేకలవ్యుఁడు గొప్ప విలుకాడగుననియెంచి ద్రోణుఁడు వానింజూచి "ఓయీ! నీవు నాకు శిష్యుడ వంటివి. కావున గురుదక్షిణ నీయవలదా" యని పలికెను. "స్వామీ! ఇది నాశరీరము. ఇవి నాయస్త్రములు. ఇందులో నేదికోరిన నది ఇచ్చెద" నని యాతఁడు బదులుచెప్పెను. ద్రోణుఁడతనిం జూచి "నీకుడిచేయియొక్క బొటనవ్రేలు ఖండించి గురుదక్షిణగా ని'' మ్మని యడిగెను. అందులకు

ఏకలవ్యుఁడు కొంచెమయినను సందేహము నొందకుండ, ద్రోణుఁడు కోరినట్లిచ్చి నమస్కరించెను. ద్రోణుఁడు వానికిఁ దనయందున్న భక్తికి సంతసించెను.

బాలులారా! గురుఁడే దైవమని భావించి పూజించు వానికి ఎట్టి విద్యలయినను లభించును.



## ౭౨ పరశురాముఁడు

### తండ్రియాజ్ఞ మీఱరాదు.

జమదగ్ని యనునొక మునీంద్రుఁడు గలఁడు. ఆతని భార్య పేరు రేణుక. అతనికిఁ బెక్కండ్రు కొడుకులుగలరు. అందులోఁ గడగొట్టు కొడుకు పేరు పరశురాముఁడు. ఒకనాడు రేణుక జలముదెచ్చుటకు నదికిఁబోయెను. అప్పుడు నదియందు చిత్రరథుఁడను గంధర్వుఁడు తన భార్యలతో జలక్రీడ లాడుచుండెను. రేణుక యా విచిత్రమును జూచుచు నట్టె నిలిచియుండి, కొంతసేపటికిఁ దెలివిఁదెచ్చుకొని, "ఇంత యాలస్యమయినందులకు భర్త యేమని కోపించునో''యని భయమందుచు జలంబుగొని యాశ్రమమునకుఁబోయెను. జమదగ్నియామె తడవుసేయుటకుఁ గారణము తన దివ్యదృష్టి నెఱిఁగి కోపముఁబూని, తన పుత్రులను బిలిచి "మీతల్లిని దక్షణమే చంపు"డని యాజ్ఞాపించెను. అందుల కెవ్వరును సమ్మతింపలేదు. అంతఁ గడగొట్టు వాఁడైన పరశురాముని బిలిచి జమదగ్నియిట్లనెను. "పుత్రా! నీయన్న లెవ్వరును నాయాజ్ఞపాలింపకయున్నారు. కావున నీవు నీయన్నలను తల్లినిగూడ వధింపుము" ఇప్పుడు పరశురాముఁ డేమిసేయును? తల్లినిజంపి పాతకము గట్టుకొనునా? లేక తండ్రియాజ్ఞ నిరాకరించునా ? రెండును నాతనికిఁ

బాపము గలుగఁజేయు నవియే. ఇందుగూర్చి యాతఁడు బాగుగ యోచించి, తుదకుఁ దండ్రియాజ్ఞఁ బాలించినచో శుభములు గలుగునని నిశ్చయించుకొని, గొడ్డలితోఁదల్లిని- నన్నలను జంపి వేసెను.

జమదగ్ని పరశురాముని పితృభక్తికి సంతసించి "నాయనా! నాయందు నీకున్న భక్తికి మిక్కిలి సంతోషించితిని. ఇది పాపకార్యమని తలంపక నేనాజ్ఞఁ యిచ్చుటయే తడవుగా నన్నలను- తల్లిని వధించితివి. నీగుణము సమస్తదేవతలచేతఁ బొగడఁబడుగాక! నీకీర్తి సకలదిక్కుల నిండుగాక! నీకెట్టి వరము గావలయునో కోరుకొనుము. ఇచ్చెద." తండ్రిమాటలు విని, పరశురాముఁ డాతనికి నమస్కరించి, తనచేత వధింపఁబడిన యన్నలను తల్లిని బ్రదికించునట్లు కోరెను. కుమారుని ప్రార్థనము విని జమదగ్ని పుత్ర సహితముగా రేణుకను బ్రదికించెను. పరశురాముఁడు సంతోషించెను.



# 28 భీముఁడు

## తల్లిమాట జవదాటరాదు

పాండవు లొకప్పుడు బ్రాహ్మణ వేషములతో ఏక చక్రపురమునఁ గొన్నాళ్లు ఒక బ్రాహ్మణుని యింటనుండిరి. ఆ పురమునకు సమీపముననున్న మహారణ్యములో బకాసురుఁడను నొక రాక్షసుఁడుండెను. వాడెప్పుడును నేక చక్రపురము మీదఁబడి కనఁబడిన వారినెల్లఁజంపి తినుచుండును. అందుచేతఁ బ్రజలెల్లరును వాని పాలికిఁబోయి "నీవు ప్రతిదినమును మాయూరిపైఁ బడి యిట్లు సేయవలదు. మేము నీకు అనుదినమును ఒక్క మనుష్యుని రెండెనుబోతులఁ బూన్చిన బండి యన్నమును నీకు ఆహారముగాఁ బంపుదుము," అని చెప్పిరి. అందులకువాఁడు సమ్మతించెను నాటినుండియు-ఏకచక్రపురవాసులు ఇలువరుస నొక్కొక్క మానిసిని, రెండెనుబోతులఁ గట్టినబండెడన్నమును బకునకుఁ బంపుచుండిరి.

ఇట్లుండ బకునకాహారముగాఁ బోవుటకు ఒకనాఁడు పాండవులు విడిసియున్న బ్రాహ్మణుని యింటివంతు వచ్చినది. బకునకాహారముగా నెవరుపోదురాయని యింటి వారందఱును విచారించుచుండిరి. నేనుపోవుదు నేనుపోవుదునని బ్రాహ్మణుఁడును భార్యయుఁ బుత్రుడును బుత్రికయుఁ

బలుకుచుండిరి. ఆయిల్లంతయు ఆనాడు రోదన ధ్వనులతో నిండియుండెను- అప్పుడు పాండవులకుఁ దల్లియైన కుంతి వారి దుఃఖమునుజూచి నెమ్మదిగా వారినిజేరి దుఃఖకారణ మును దెలిసికొనెను. తరువాత ఆమె వారినిజూచి "మీరు దుఃఖింపవలదు. ఆరాక్షసున కాహారముగా నారెండవ పుత్రుని పంపెద" నని చెప్పి భీమునిఁబిలిచి వారి దుఃఖము నకుఁ గారణము నెఱింగించి యాబకాసురునిఁజంపి ప్రజలను రక్షింపుమనెను. భీముఁడు తల్లియాజ్ఞను బాలించుటకు సమ్మతించెను. అంతట నాబ్రాహ్మణుఁడు భీమునకుఁ గావలసిన భోజనము పెట్టించి ఎనుబోతులబండిపై నన్నముఁ బెట్టించెను. భీముఁడా బండిని దోలుకొనిపోయి బకాసురుని నివాసమును సమీపించి బండినాపెను.

ఆనాడింకను దనకు ఏకచక్ర పురవాసులు ఆహారమును బంపలేదని బకాసురుఁడు ఆకలిబాధచేఁ గోపముతో కేకలువేయుచు నెదుటబండినాపి నిలిచియున్న భీముని జూచి, "ఇంత యాలస్యమా? ఇట్లయిన నేను సహింపను. ఏకచక్రి పురవాసులనందఱి నొక దినముననే చంపివేసెద" నని భీకరముగాఁ బలికెను. భీముఁడు వాని యట్టహాసమును లక్ష్యపెట్టక బండిపైనున్న అన్నమునంతయుఁ దానే తిన సాగెను. బకాసురుఁ డదిచూచి మండిపడుచు భీముని సమీ

పించెను. భీముఁడు బండిపైనుండి నేలకు లంఘించి బకాసురుని బట్టికొని నేలఁబడఁగొట్టిచంపి వాని కళేబరమును పురములోని కీడ్చుకొని వచ్చెను. ప్రజలెల్లరు బకుని కళేబరమును జూచి సంతోషించి తమకు సౌఖ్యముగలుగఁ జేసినందులకు భీమునిఁ బెక్కువిధముల బొగడిరి.



## 29 అభిమన్యుఁడు

పలువు రేకమగుచోట బలము పనికిరాదు.

పాండవమధ్యముఁడైన యర్జునునకు సుభద్రయందు అభిమన్యుఁడను నొక కుమారుఁ డుదయించెను. ఈకుమారుడు పాండవు లరణ్యావాసమున నున్నకాలమున మేనమామలగు బలరామ కృష్ణుల యొద్దనుండి అస్త్రవిద్య మొదలగునవి యన్నియు నేర్చుకొనెను. ఇతఁడు విరటుని కూతురగు నుత్తరను బలరాముని కూతురగు శశిరేఖను బెండ్లియాడెను. పాండవులు వనవాసము చేసివచ్చిన తరువాత కౌరవులు వారికి రాజ్యభాగము నీయని కారణమున వారికిని వీరికిని గొప్ప యుదము జరిగెను. దీనినే భారత యుద్ధ

మూఁడురు- రెండు పక్షములయందుఁ బెక్కండ్రు వీరులు చచ్చిరి.

ఒకనాటి యుద్ధమునఁ గౌరవులకు గురుఁడయిన ద్రోణాచార్యుఁడు, ధర్మరాజును బంధించి దుర్యోధనుని ముందుబెట్టుదునని ప్రతిజ్ఞ జేసెను. అందులకై యాతఁడొక వ్యూహమును బన్నెను- దానిపేరు పద్మవ్యూహము- ఈ వ్యూహమును భేదించుట యర్జునుఁడుదప్ప మఱియెవ్వరు నెఱుఁగరు. అభిమన్యునకు మొగ్గరమునందుఁ బ్రవేశించుట తెలియునుగాని యీవలకువచ్చుట తెలియదు. ఆసమయమున అర్జునుఁ డచ్చటలేడు- కృష్ణార్జునులు మఱియొకరితో యుద్ధము సేయుటకుఁ బోయియుండిరి. ద్రోణుఁడు పన్నిన వ్యూహమునకు భయమునంది ధర్మరాజు శిబిరమునందే డాగియుండి దానిని భేదించుటకు అభిమన్యుని బంపెను. అభిమన్యునకు సహాయము సేయుటకై భీముఁడు మొదలగు వారుగూడఁబోయిరి. అభిమన్యుఁడు బాలుడయినను శౌర్య సాహసములతో వీరుల నందఱిని దాఁకి పద్మవ్యూహమును భేదించి లోపలఁ బ్రవేశించెను· భీమాదులుగూడ నాతఁడు చేసిన మార్గమున లోనికిఁ బోవుచుండ సైంధవుఁడు వారిని నిలువరించెను. అభిమన్యుఁ డొక్కడే వ్యూహము నందుండెను. ఆతని పరాక్రమమునకు దేవతలుగూడ నద్భుతమందునట్లు బోరుచు గౌరవ వీరులనెల్లరఁ జికాకుపఱచుచుండెను. ఆతనికి దుర్యోధన కర్ణాది యోధులోడి పోయిరి. వారందఱకును అభిమన్యుని జూచిన సింహస్వప్నమువలె

నుండెను. ఆతనియెదుట నెవ్వరును నిలువఁజాలకయుండిరి. కౌరవయోధులందఱును ఒక్క, యభిమన్యునిచేతిలోనే యానాఁడు పడిపోదురని వారు భయంబందిరి. ఆబాలుని గూల్చుటకు వారికే విధమయిన మార్గము దోచలేదు. అంతట ద్రోణునిమాటపై వారందఱును గలిసి యొక్కపెట్టున నభిమన్యునిదాకిరి. అందఱు నేకమై తనతోఁ బోరుచున్నను సౌభద్రుఁడు భయమందలేదు. కాని యొక్కఁడు పెక్కుమంది వీరుల నెదిరించుట కష్టముగదా? అభిమన్యునకు సహాయముసేయు వారెవ్వరునులేరు. వ్యూహమున కావలనున్న భీమాదులను సైంధవుఁడు లోపలఁ ప్రవేశింపకుండఁ జేయుటచే వారువచ్చి యభిమన్యునకుఁ దోడ్పడఁ జాలకపోయిరి. అందఱునేకమై పోరుచున్నను నభిమన్యుఁడు వెనుదీయక యందఱతో నన్నివిధముల నెదిరించుచుండుట జూచి యాకౌరవ వీరులు వానిపై నొక్కపెట్టునఁబడిరి. ఒకడాతని సారథిం జంపెను. మఱియొకఁడు గుఱ్ఱముల గూల్చెను. ఇంకొకఁడు విల్లును దుంచెను. ఇట్లందఱు నన్నివిధములసేయ నాకుమారునకు రథము సమకూర్చువాఁడు గాని విల్లందిచ్చువాడుగాని లేకపోయెను. తుదకందఱునుగలిసి యాకుమారవీరుని వధించిరి.

కావున నెంతటి బలవంతుఁడైనను బలువురేకమైనచో నేమియుఁ జేయఁజాలఁడు.



# 30 సృంజయుఁడు

దురాశ దుఃఖమునకుఁ గారణము.

పూర్వము సృంజయుఁ డను రాజుగలఁడు- అతని మందిరమున కొకనాఁడు పర్వతుఁడును- నారదుఁడును, అను మునీంద్రులు వచ్చిరి- సృంజయుఁడు వారి ననేకవిధములఁ బూజించి తన గృహమునఁ గొన్నాళ్లుండునట్లు కోరెను- రాజేంద్రుని యభీష్టము దీర్చుటకా ముని పుంగవులాతని మందిరమునఁ గొన్ని దినములుండిరి. సృంజయుఁడు వారి నతిభక్తితో సేవించుచుండెను. ఆ మునీంద్రులాతని భక్తివినయములకు సంతసించి యేదైన వరముగోరుకొనవలసినదని పలికిరి. సృంజయుఁడు వారిం జూచి ''మునీంద్రులారా! నాకు నిత్యమును సువర్ణమును గురియునట్టి కొడుకును బ్రసాదింపు''డని కోరెను. వారు రాజునకావరమిచ్చి 'రాజేంద్రా! నీకు జనించు పుత్రుని శరీరము నుండి వెలువడు మలమూత్రములు - చెమట - నిష్ఠీవనము- మొదలగునవియన్నియు సువర్ణమేయగుచుండు'' నని పలికి యరిగిరి.

కొన్నాళ్ళకు సృంజయునకొక కొడుకుపుట్టెను. ఆతనికి సువర్ణష్ఠీవియను పేరు పెట్టఁబడెను. వాని నిష్ఠీవనము మలమూత్రములు-అశ్రువులు-సువర్ణమయములుగానొప్పెను. సృంజయుని గృహమంతయు బంగారమే - ఆతని సంపద, కుబేరుని సంపదను మించియుండెను. ఇట్లుండ చోరులీ

వృత్తాంతము నెఱింగి, సమయము వేచియుండి, యాసువర్ణ ష్ఠీవి నొక్కనాడెత్తికొనిపోయి, యొక యరణ్యమున వధించి శరీరంబంతయు వెదకి, సువర్ణమును గానక మృతకళేబరము నచ్చటనె పాఱవేసిపోయిరి. సృంజయుఁడు కుమారుని మరణమువిని, దురాశమూలమున నట్టి దుఃఖము గలిగెనని తలంచి, విధికృతము నెవ్వరును దప్పింపలేరని యూరడిల్లెను.



## 31 రావణుఁడు

గర్వమువలన హాని కలుగును.

మున్ను లంకాపురము నేలు రావణుఁడను దైత్యుఁడు బ్రహ్మచేత ననేకవరములను బొంది, తనకంటెఁ బరాక్రమవంతుఁడు మూఁడులోకములయందు లేడను గర్వమునఁ జరించుచుండెను. ఒకసమయమున నాతఁడు దిగ్విజయమునకు వెడలి కైలాసపర్వతము మీఁదిగఁ బుష్పకముపైఁబోవుచుండెను. ఎందుచేతనో కైలాసగిరిని సమీపించి యాపుష్పకము ముందునకుఁ బోవక నిలిచిపోయెను. కైలాసపర్వతము-అడ్డమగుటచేతఁ దన పుష్పకమాగిపోయినదని తలంచి, రావణుఁడు పుష్పకమునుండి దిగి, పర్వతమును బెకలింపఁ

దలంచెను. అతఁడు తనబలమును దలుచుకొని, గర్వము వహించి యట్టి సాహసకార్యమును సేయనెంచెను. కాని, యప్పర్వతముపైఁ బార్వతీ సహితుఁడైయున్న పరమేశ్వరుని దర్శించుట శుభంబని తలుపలేదు. అతఁడు పర్వతమెత్తుటకు దనశక్తి నంతయు వినియోగపఱచెను. కానిబలము పనికి వచ్చునా? మహేశ్వరుఁడతనికి గర్వభంగముసేయఁ దలచి, యప్పర్వత రాజమును కాలి బొటన వ్రేలితో క్రిందికినదిమెను. రావణుఁడు పర్వతమును పెకలింపలేకపోవుటయేగాక దాని క్రింద జిక్కుకొనెను. ఈవలకువచ్చుట కెంతో ప్రయత్నించెను. కాని లాభము లేకపోయెను. అతఁడావిధమున బెక్కు సంవత్సరములుండి, తానుచేసిన కార్యమునకుం బశ్చాత్తాపము నంది, పరమేశ్వరుఁడే తనకట్టి పరాభవముఁ జేసినాడని తలంచి, యాదేవదేవుని సామగానముచే స్తుతించెను. ఈశ్వరుఁడతని స్తుతికి సంతోషించి, అతనిని విడిచిపెట్టెను.

కావున తనకెంత బలమున్నను, దనకంటె మించినవారులేరని గర్వపడుట యెంతమాత్రమును బనిరాదు.

